# ముల్కీరూల్సు పునరుద్ధరణ ఆవశ్యకత

- సి. విఠల్ & శ్రీధరరావు దేశ్‌పాండే

1956లో ఆంధ్ర తెలంగాణ ప్రాంతాల విలీనం బేషరతు విలీనం కాదు. ఆంధ్ర ప్రాంత నాయకులు తెలంగాణ ప్రజలకిచ్చిన వాగ్దానాలలో అత్యంత ప్రధానమైనది ముల్కీ రూల్సు కొనసాగింపు. 1956 నుండి 1975 దాకా అంటే రాష్ట్రపతి ఉత్తర్వులు వెలువడిన దాకా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఆచరణలో విఫలమైనా అధికారికంగా ముల్కీ రూల్సు అమలులో ఉన్నాయి. తెలంగాణ ప్రాంత ఉద్యోగాలలో, కళాశాలల్లో ప్రవేశం పొందడానికి అభ్యర్థులు తప్పనిసరిగా ముల్కీ సర్టిఫికేట్లు సమర్పించవలసి వచ్చేది. అయితే సమైక్యరాష్ట్రంలో ముల్కీ రూల్సు యథేచ్ఛగా ఉల్లంఘించబడినాయి. దొంగముల్కీ సర్టిఫికేట్లు సంపాదించి అక్రమంగా ఉద్యోగాలలోకి ఆంధ్రులు చొరబడినారు. 1968 నాటికి ఇట్లా ముల్కీ రూల్సుకు విరుద్ధంగా చొరబడిన వారి సంఖ్య 22 వేలుగా తేల్చారు. హైదరాబాద్ రాష్ట్రంలో ముల్కీ రూల్సు ఆవిర్భవించిన చరిత్రను పరిశీలిస్తే ముల్కీ, నాన్‌ముల్కీ ఘర్షణకు 550 సంవత్సరాల చరిత్ర ఉందని తెలుస్తున్నది.

### ముల్కీ రూల్సు చరిత్ర :

కాకయతీయుల సామ్రాజ్యం పతనం అనంతరం దక్కన్ పీఠభూమి, బహమనీ సుల్తానుల పాలనలోకి వెళ్లింది. తదనంతరమే దక్కన్ ప్రాంతంలో, హైదరాబాద్ రాజ్యంలో ముల్కీ, నాన్‌ముల్కీల సమస్య తలెత్తడం ప్రారంభం అయ్యింది. బహమనీ సుల్తానుల కాలంలోను ఉత్తరాది నుండి వలస వచ్చి దక్కన్‌లో ఉద్యోగాలను కొల్లగొట్టిన ఉత్తరాది వారికి, దక్కనీ ముల్కీలకు ఎప్పుడూ ఘర్షణ ఉంటూనే ఉండేది. ఉత్తరాది నుంచి వలసవచ్చిన వీరిని ఆఫాకీలుగా వ్యవహరించేవారు. ఆఫాకీలు సైన్యంలో, ప్రభుత్వ ఉద్యోగాలలో, వర్తక, వాణిజ్యాలలో చొరబడి ఆర్థికంగా బలపడినారు. దర్బారుల్లో ప్రముఖ స్థానాలను, మంత్రి పదవులను దక్కించుకున్నారు. దక్కనీలు రెండవ శ్రేణి పౌరులుగా దిగజారి పోయినారు. ప్రభుత్వంలో ఆఫాకీలదే పైచేయి అయి వారే అన్ని ప్రయోజనాలు పొందేవారు. ఈ కారణంగా ఆఫాకీలకు, దక్కనీలకు అన్ని రంగాలలో

అంతరాలు పెరిగిపోయి శతృత్వం ఏర్పడి పోయింది. దీనికితోడు ఆఫాకీలు షియాలు, దక్కనీలు సున్నీలు కావడంతో మతపరమైన వైరుధ్యాలు కూడా ముల్కీ, గైర్ ముల్కీ సమస్యను తీవ్రతరం చేసినాయి. ఇటువంటి ముల్కీ గైర్ ముల్కీ సమస్య సైన్యంలోకి చొరబడి ఘర్షణలు తల ఎత్తి చివరికి 1521లో బహమనీ రాజ్యం అంతరించిపోయింది. దీని స్థానంలో ఐదు రాజ్యాలు ఏర్పాటయినాయి. అందులో గోల్కొండ కుతుబ్‌షాహీ రాజ్యం ఒకటి. గోల్కొండ రాజులు ముల్కీలను గౌరవించారు. ఉద్యోగాలలో సముచిత స్థానం కల్పించారు. స్థానిక భాషా సంస్కృతులను గౌరవించారు. అందువల్లనే కుతుబ్‌షాహీల కాలంలోముల్కీ నాన్‌ముల్కీ సమస్య సద్దుమణిగింది.

గోల్కొండ రాజ్యం కూలిపోయిన తర్వాత మొగల్ చక్రవర్తి ప్రతినిధిగా ఉత్తరాది నుండి వచ్చి ఆసఫ్‌జాహీలు స్వతంత్రం ప్రకటించుకొని హైదరాబాద్ రాజ్యాన్ని స్థాపించారు. వీరికున్న ఉత్తరాది సంబంధాల వలన లక్నో, ఢిల్లీ, ముర్షిదాబాద్, అవద్ రాజ్యాల నుండి అనేక మంది నిజాం రాజ్యంలోకి వలసవచ్చి ఇక్కడి ఉద్యోగాలలో చొరబడిపోయినారు. నిజాం నవాబులు వీరిని ప్రోత్సహించారు. ఐదవ నిజాం కాలంనాటికి ముల్కీ, గైర్ ముల్కీల సమస్య తిరిగి ప్రస్ఫుటంగా రంగం మీదకి వచ్చింది. ఐదవ నిజాం కాలంలో ప్రధానమంత్రిగా ఉన్న సర్ సలార్ జంగ్-1 హైదరాబాద్ సివిల్ సర్వీసును స్థాపించి ఉత్తరాది నుండి ముఖ్యంగా అలీగఢ్ నుండి చదువుకున్న వారిని ప్రభుత్వ ఉద్యోగాలలోకి ఆహ్వానించాడు. ఈ వలసల పట్ల స్థానిక ప్రజలు నిరసన వ్యక్తం చేసినప్పటికీ సాలార్‌జంగ్ తన విధానాన్ని కొనసాగించారు. ఆ తర్వాత 1889 ప్రాంతంలో సాలార్‌జంగ్-2 పరిస్థితి తీవ్రతను నిజాం ప్రభువుకు నివేదించి ఉద్యోగాలలో స్థానికులకే అవకాశాలు కల్పించాలని సూచించాడు. మహారాజు సర్ కిషన్ పర్‌షాద్ ప్రధానమంత్రిగా ఉన్న కాలంలో ముల్కీ సమస్యపై చొరవ తీసుకొని ముల్కీ ఫర్‌మానా 1919లో జారీ కావడానికి కారకుడైనాడు. 16-11-1919న నిజాం ముల్కీ ఫర్‌మానా జారీ చేస్తూ ప్రభుత్వ ఉద్యోగాలకు స్థానికులు మాత్రమే అర్హులు. వారు తప్పనిసరిగా ముల్కీ సర్టిఫికేట్‌ని సమర్పించాలి. స్థానికులలో అర్హులు లేని పక్షంలోనే స్థానికేతరులను నియమించాలని ఆదేశించాడు.

## ముల్కీలంటే ఎవరు?

ముల్కీలంటే ఎవరు? ఎవరికి ముల్కీ సర్టిఫికేట్లు ఇవ్వాలి? అన్న విషయంలో 1919లో ఫర్మానా జారీ చేసేనాటికి స్పష్టత లేదు. 12-15 సం॥ల స్థిర నివాసం ఉన్నవారినే ముల్కీలలుగా భావించేవారు. అయితే ముల్కీ సర్టిఫికేట్లు ఎవరికి ఇవ్వాలి అన్న విషయంలో మరిన్ని వివరణలు ఇస్తూ 1934లో నిజాం మరొక ఫర్మానా జారీ చేశారు. 7-6-1934న జారీ అయిన ఫర్మానా ఇచ్చిన వివరణ ప్రకారం.

"The person who has appointed on govt. posts has to submit mulki certificate. The precondition for the issue of mulki certificate is that the father and grand father of the applicant should have been residing in the state last 12 to 15 years. Since the precondition for the issue of mulki certificate to whom who are residing in the state last 12-15 years is not appears to be correct. Residing in the state in not sufficient but ought to have mingled in the Hyderabadi society and having properties in the state and celebrated marriage with locals."

12-15 సంవత్సరాల స్థిర నివాసం ఒక్కటే ముల్కీ సర్టిఫికేట్ పొందడానికి ప్రాతిపదిక కారాదని, అభ్యర్థి తండ్రి, తాతల నివాసం, అతని వివాహ సంబంధం, అతనికి ఉన్న ఆస్తులు మొదలైనవి కూడా పరిగణలోనికి తీసుకునే ముల్కీ సర్టిఫికేట్ జారీ చేయ్యాలని 1934లో సవరించిన ముల్కీ ఫర్మానా ఆదేశిస్తున్నది.

1919లో మొదటిసారి జారీ అయి ఆ తర్వాత మరిన్ని వివరణలతో 1934లో మరోసారి జారీ అయిన ముల్కీ రూల్సు ఫర్మానా నిజాం రాజ్యం ఇండియన్ యూనియన్‌లో కలిసిపోయేదాకా అంటే 1948 దాకా నిరాఘాటంగా అమలయి స్థానికులకు ఉద్యోగాలలో సముచిత స్థానం లభించేందుకు దోహదం చేసినాయి. 1948 నుండి 1952 దాకా 4 సంవత్సరాల పాటు హైదరాబాద్ రాష్ట్రం మిలటరీ పాలనలో ఉన్నది. కేంద్ర ప్రభుత్వం వెల్లోడి అనే ఐ.సి.ఎస్. అధికారిని ముఖ్యమంత్రిగా నియమించింది. ఈ నాలుగేళ్ల కాలంలో ముల్కీ రూల్సు తీవ్ర ఉల్లంఘనకు గురి అయి వేలాది మంది నాన్‌ముల్కీలు ముఖ్యంగా తమిళులు, ఆంధ్రులు హైదరాబాద్ రాష్ట్రంలో చొరబడినారు. వెల్లోడి ప్రభుత్వం ఈ చొరబాటును యధేచ్ఛగా అనుమతించింది. ఈ చొరబాటును నిరసిస్తూ 1952లో 'గైర్ ముల్కీ గోబ్యాక్' 'ఇడ్లీ సాంబారు గోబ్యాక్' ఉద్యమాన్ని విద్యార్థులు చేపట్టినారు. 1952లో హైదరాబాద్ రాష్ట్రంలో ఎన్నికలు జరిగి బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా ప్రజా ప్రభుత్వం ఏర్పడినా వెల్లోడి ప్రభుత్వంలో చోటుచేసుకున్న ముల్కీ రూల్సు ఉల్లంఘనల్ని సవరించలేదు. ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. వరంగల్‌లో మొదలైన 'గైర్ ముల్కీ గోబ్యాక్' ఉద్యమం అన్ని తెలంగాణ జిల్లాలకు పాకింది. సమ్మెలు, క్లాసుల బహిష్కరణ, ఊరేగింపులు సర్వసాధారణమైపోయినాయి. విద్యార్థులపై లాఠీఛార్జీలు జరిగినాయి. కాల్పులు జరిగినాయి. ఈ కాల్పుల్లో మొత్తం 18 మంది విద్యార్థులు ఆసువులు బాసారు. వందలాది మంది గాయపడినారు. సుమారు 350 మంది విద్యార్థులను, పత్రికా విలేఖరులను అరెస్టు చేసి జైళ్ళలో నిర్భందించారు. ఇన్ని త్యాగాలు చేసినా గైర్ ముల్కీలు మాత్రం వెనక్కి వెళ్లిపోలేదు.

## ఆంధ్ర తెలంగాణ రాష్ట్రాల విలీనం

1953లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుండి ఆంధ్రను విడదీసి ఆంధ్ర రాష్ట్రాన్ని కర్నూలు రాజధానిగా ఏర్పాటు చేసింది కేంద్ర ప్రభుత్వం. ఆంధ్రులకు రాజధాని నగరం



 

లేదు. కర్నూలులో డేరాలలో రాష్ట్ర సచివాలయాన్ని నడుపుతున్నారు. లోటు బడ్జెటు. ఉద్యోగులకు జీతాలు కూడా ఇచ్చే పరిస్థితి లేదు. మరోవైపు హైదరాబాదు రాష్ట్రం సర్వాంగ సుందరమైన, సకల సౌకర్యాలతో ఉన్న రాజధానితో, మిగులు బడ్జెటుతో, నీళ్ళు, బొగ్గు, అటవీ సంపద తదితర ప్రకృతి వనరులతో అలరారుతున్నది. హైదరాబాద్ రాష్ట్రాన్ని కలుపుకుంటే తప్ప ఆంధ్ర రాష్ట్రం మనుగడ సాగించలేదని విశాలాంధ్ర నినాదాన్ని లేవనెత్తారు ఆంధ్రులు. భాషా రాష్ట్రాల సిద్ధాంతాన్ని ముందుకు తెచ్చారు.

1953లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటుతోనే దేశవ్యాప్తంగా ప్రత్యేక రాష్ట్రాల డిమాండ్లు వెల్లువెత్తినాయి. దేశ సమగ్రతను కాపాడే లక్ష్యంతో కేంద్ర ప్రభుత్వం 'రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘాన్ని' జస్టిస్ సయ్యద్ ఫజల్ అలీ చైర్మన్‌గా, హెచ్.ఎన్. కుంజ్రూ, కె.ఎం. ఫణిక్కర్ సభ్యులుగా నియమించింది. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం ఏర్పాటుతో ఆంధ్రులు విశాలాంధ్ర ప్రయత్నాలను ముమ్మరం చేశారు. తెలంగాణలో విశాలాంధ్ర భావనకు మద్దతును కూడగట్టడంలో కమ్యూనిస్టులు ప్రముఖపాత్ర పోషించినారు. హైదరాబాద్ రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు కొండా వెంకట రంగారెడ్డి, మర్రి చెన్నారెడ్డి, హయగ్రీవాచారి లాంటివారు విలీనానికి వ్యతిరేకులు. ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు మొదట్లో విలీనానికి వ్యతిరేకంగా ఉన్నప్పటికి అటు తర్వాత విశాలాంధ్రకు అనుకూలంగా మారిపోయినారు. రాజకీయ నాయకులు ఎట్లున్నప్పటికీ తెలంగాణ ప్రజలు విలీనాన్ని వ్యతిరేకించారు. విలీనాన్ని వ్యతిరేకిస్తూ వేలాది వినతిపత్రాలు రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘానికి అందినారు. ఆంధ్రులతో కలిస్తే తాము దోపిడీకి, వివక్షకు, నిర్లక్ష్యానికి గురి అవుతామని వారు భయందోళనలు వ్యక్తం చేశారు.

ఎస్.ఆర్.సి తెలంగాణ ప్రజల మనోభావాలను పరిగణలోకి తీసుకున్నది. తెలంగాణ ప్రజల భయాలను, అభద్రతను అర్థం చేసుకున్నది. విలీనం వల్ల లాభనష్టాలను కూలంకషంగా బేరీజు వేసుకొని ఈ సిఫారసును చేసింది.

"తెలంగాణ ప్రాంతం ఆంధ్ర ప్రాంతంలో విలీనమైతే అధిక సంఖ్యలో ఉన్న ఆంధ్ర ప్రాంతం వారే ఉమ్మడి రాష్ట్రంలో లభించే అన్ని లాభాలను హస్తగతం చేసుకొని తెలంగాణ ప్రాంతాన్ని దోచుకొని, ముంచేసి, దానిని ఒక వలస ప్రాంతంగా మార్చివేసే ప్రమాదం ఉంటుందని తెలంగాణా ప్రజలు భయపడుతున్నారు." (ఎస్.ఆర్.సి. రిపోర్ట్ పేరా 378).

"ఉభయ ప్రాంతాల శ్రేయస్సు దృష్ట్యా తెలంగాణ ప్రాంతాన్ని ఒక ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పర్చడమే మంచింది. దానికి హైదరాబాద్ రాష్ట్రమని నామకరణం చెయ్యవచ్చు. 1961 ప్రాంతంలో జరుగబోయే సాధారణ ఎన్నికల తర్వాత ఒకవేళ హైదరాబాద్ (తెలంగాణ) రాష్ట్ర శాసనసభ్యులలో మూడింట రెండువంతుల మంది అంగీకరిస్తే ఆంధ్ర రాష్ట్రంలో విలీనీకరణ గురించి ఆలోచించవచ్చు. అది జరగని పక్షంలో తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా కొనసాగవలసి ఉంటుంది. (ఎస్.ఆర్.సి.రిపోర్టు, పేరా 386, 388)



ఎస్ఆర్‌సి సిఫారసులతో బేంబేలెత్తిన ఆంధ్రనాయకత్వం ఢిల్లీకి పరుగులు తీసింది. ఢిల్లీ నాయకత్వాన్ని లోబర్చుకున్నది. విలీనానికి వ్యతిరేకంగా ఉన్న నెహ్రూ కూడా అయిష్టంగానే విలీనానికి అంగీకరించాడు. దానికంటే ముందే ముఖ్యమంత్రి బూర్గులను లోబర్చుకొని అసెంబ్లీలో విలీనానికి అనుకూలంగా తీర్మానం చేయించినారు. 1956 మార్చి 5న నిజామాబాద్‌లో భారతసేవక సమాజ్ ఏర్పాటు చేసిన బహిరంగ సభలో నెహ్రూ విలీనాన్ని ప్రకటించాడు. వివాహంతో పాటు విడాకులు పత్రాన్ని కూడా రాసిపెట్టినాడు ఆనాటి ప్రధాన మంత్రి నెహ్రూ. ఆయన మాటల్లోనే...

"ఒక అమాయకురాలి (తెలంగాణ) పెండ్లి ఒక తుంటరి పిల్లవానితో (ఆంధ్ర) జరుగుతున్నది."

"తెలంగాణ ఆంధ్ర ప్రాంతాలు కలిసి ఉండే పొంతన కుదరకపోతే ఆలుమగలు విడాకులు ఇచ్చుకున్నట్లే కొంత కాలం తర్వాత రెండు ప్రాంతాలు విడిపోవచ్చు."

(ఇండియన్ ఎక్స్‌ప్రెస్ : 6-3-1956)

ఆ రకంగా ప్రధానమంత్రి నెహ్రూ వ్యతిరేకించినా, ఎస్సార్సీ సిఫార్సులు విలీనానికి వ్యతిరేకంగా ఉన్నా, తెలంగాణ ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా విలీనం సంభవించింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటయ్యింది.

## పెద్దమనుషుల ఒప్పందం

ముందే చెప్పుకున్నట్లు విలీనం షరతులతో కూడుకున్నది. విలీనానికి ముందు ఆంధ్ర, తెలంగాణ నాయకుల మధ్య ఒప్పందం కుదిరింది. దాన్నే 'పెద్ద మనుషుల ఒప్పందం (Gentlemen's Agreement) అంటాము. ఆంధ్రుల పక్షాన బెజవాడ గోపాలరెడ్డి (ముఖ్యమంత్రి), నీలం సంజీవరెడ్డి (ఉపముఖ్యమంత్రి), గౌతు లచ్చన్న (మంత్రి), అల్లూరి సత్యనారాయణ రాజు (పిసిసి అధ్యక్షుడు) తెలంగాణ పక్షాన బూర్గుల రామకృష్ణారావు (ముఖ్యమంత్రి), కొండా వెంకట రంగారెడ్డి (మంత్రి), మర్రి చెన్నారెడ్డి (మంత్రి), జె.వి. నర్సింగరావు(పిసిసి అధ్యక్షుడు) ఈ ఒప్పందంపై జూన్ 19, 1956న సంతకాలు చేశారు.

## పెద్దమనుషుల ఒప్పందంలో ముఖ్యమైన అంశాలు :

- ఖర్చు ఆంధ్ర, తెలంగాణలు 2:1 నిష్పత్తిలో భరించాలి.
- తెలంగాణ మిగులు ఆదాయాన్ని తెలంగాణ అభివృద్ధికే వినియోగించాలి.
- సమైక్య రాష్ట్రంలో ముల్కీరూల్సు కొనసాగుతాయి.
- తెలంగాణ ప్రాంత సమగ్రాభివృద్ధి కొరకు ప్రాంతీయ మండలి ఉండాలి. నీటిపారుదల, వ్యవసాయం, పారిశ్రామికాభివృద్ధి. ఉద్యోగ వ్యవహారాలు, మండలి పరిధిలో ఉంటాయి. తెలంగాణ భూములను ఇతర ప్రాంతాలు వారు మండలి అనుమతి లేకుండా కొనుటకు వీలుండదు.

- ముఖ్యమంత్రి ఆంధ్రప్రాంతం వాడైతే ఉపముఖ్యమంత్రి తెలంగాణవాడై ఉండాలి. ముఖ్యమంత్రి తెలంగాణవాడైతే ఉపముఖ్యమంత్రి ఆంధ్రప్రాంతం నుండి ఉండాలి.

పెద్ద మనుషుల ఒప్పందాన్ని ఆంధ్రప్రదేశ్ ఏర్పాటైన మరుక్షణం నుండే ఉల్లంఘించడం ప్రారంభించారు. ఆంధ్రప్రాంతం నుండి ముఖ్యమంత్రి అయిన సంజీవరెడ్డి తెలంగాణ నుంచి ఉపముఖ్యమంత్రిని నియమించవల్సి ఉండే. అంతవరకు తాను నిర్వహించిన అదే పదవిని ఆరోవేలుగా ప్రకటించి ఉపముఖ్యమంత్రిని నియమించడానికి నిరాకరించాడు.

## ముల్కీ రూల్సు ఉల్లంఘనలు

పెద్దమనుషుల ఒప్పందంలో ముల్కీరూల్సు కొనసాగిస్తామన్న హామీ అత్యంత ప్రధానమైనది. 1956 నుండి 1975 వరకు అధికారింగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ముల్కీరూల్సు అమలులో ఉన్నాయి. 1969లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఎగిసిపడడానికి ముల్కీ రూల్సును ఉల్లంఘించి వేలాది మంది ఆంధ్రులు తెలంగాణ ఉద్యోగాలలో చొరబడడమే కారణం. 1956 నుండి 1969 నాటికే సుమారు 22 వేల మంది ఆంధ్రా ఉద్యోగులు ముల్కీ రూల్సుకి విర్ధుంగా తెలంగాణలో చొరబడ్డారని ఆనాడు ప్రభుత్వమే ఒప్పుకున్నది. ఉద్యమానికి జడిసి ఈ 22 వేల మందిని వెన్నక్కి పంపడానికి జీవో 36ను (ఈనాటి 610 జీవో లాంటిదే) బ్రహ్మానందరెడ్డి ప్రభుత్వం జారీ చేసింది. జీవో జారీ చేస్తూనే మరోవైపు ఆంధ్రా ఉద్యోగులను కోర్టుకి వెళ్ళమని ప్రోత్సహించింది. ఆంధ్రా ఉద్యోగులు జీవో 36 చెల్లదని, దాన్ని కొట్టివేయయమని అభ్యర్థిస్తూ హైకోర్టుని ఆశ్రయించారు. వారి వాదనలను మన్నిస్తూ 36 జీవో చెల్లదని దాన్ని కొట్టివేస్తూ హైకోర్టు తీర్పు నిచ్చింది. ఈ తీర్పు వచ్చేనాటికి జీవో 36ను జారీ చేసిన బ్రహ్మానందరెడ్డిని ముఖ్యమంత్రి పదవి నుంచి రాజీనామా చేయించి తెలంగాణ వాడయిన పి.వి. నరసింహారావును 1971లో ముఖ్యమంత్రిని చేశారు. అప్పటికే 1971 మార్చి లోక్‌సభ మధ్యాంతర ఎన్నికల్లో తెలంగాణలోని 14 లోక్‌సభా స్థానాలలో 11 స్థానాలను తెలంగాణ ప్రజాసమితి అభ్యర్థులకు కట్టబెట్టి ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షను ప్రజలు ప్రభలంగా వెల్లడించి ఉన్నారు. అయితే 1971 నాటికి ఉద్యమ ఉధృతి కొంత తగ్గింది.

హైకోర్టు తీర్పును పి.వి. నరసింహారావు ప్రభుత్వం సుప్రీంకోర్టులో సవాలు చేసింది. వాద ప్రతివాదనల అనంతరం సుప్రీంకోర్టు అక్టోబరు 16, 1972 రోజున ముల్కీ రూల్సు రాజ్యాంగబద్ధమేనని చారిత్రాత్మక తీర్పు నిచ్చింది. సుప్రీంకోర్టు తీర్పు తర్వాత 36 జీవో అమలుకు ఉన్న అన్ని అడ్డంకులు తొలగిపోయినాయి. ఆంధ్రా ఉద్యోగ సంఘాలు సుప్రీంకోర్టు రాజ్యాంగ ధర్మాసనం ఇచ్చిన ఈ తీర్పును గౌరవించవలసింది పోయి జై ఆంధ్రా ఉద్యమాన్ని లేవదీసినారు. ఎటువంటి షరతులు,



హామీలు, ఒప్పందాలు లేని ఆంధ్రప్రదేశ్ ఉండాలి. లేనట్లయితే ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చెయ్యాలని వారి డిమాండు. జై తెలంగాణ ఉద్యమానికి లొంగని, 370 మంది విద్యార్థుల రక్తతర్పణాన్ని గుర్తించకుండా తెలంగాణ ఏర్పాటుకు నిరాకరించిన కేంద్ర ప్రభుత్వం, జై ఆంధ్రా ఉద్యమానికి మాత్రం లొంగిపోయి 1973 జనవరిలో పి.వి. నరసింహారావును ముఖ్యమంత్రి పదవి నుండి తొలగించి రాష్ట్రపతి పాలన విధించింది.

రాజీ మార్గంగా ఆంధ్రనాయకులు రచించిన ఆరు సూత్రాల పథకాన్ని ప్రధానమంత్రి ఇందిరాగాంధీ సెప్టెంబరు 1973లో ప్రతిపాదించింది. ఆనాటి తెలంగాణనాయకులు దీనిపై గుడ్డిగా సంతకం చేశారు. ఆరుసూత్రాల పథకానికి చట్టబద్ధత కల్పించడం కోసం 32వ రాజ్యాంగం సవరణ చేసి ఆర్టికల్ 371 డి ని పొందుపర్చారు. ఆ ఆర్టికల్ ద్వారా భారత రాష్ట్రపతికి దఖలు అయిన అధికారాలతో రాష్ట్రపతి ఉత్తర్వులు 18-10-1975న జారీ అయినాయి.

తెలంగాణ ప్రాంత ప్రయోజనాలకు వ్యతిరేకమైన ఈ ఆరుసూత్రాల పథకం చట్టబద్ధం కాగానే పథకం అమలు ప్రక్రియ తెలంగాణకు గొడ్డలి పెట్టయింది. ఈ ప్రక్రియలో

- సుప్రీంకోర్టు ధృవీకరించిన ముల్కీరూల్సు రద్దయినాయి.
- రాష్ట్ర బడ్జెట్‌లో తెలంగాణ ప్రాంత ఆదాయ వ్యయాలను విడిగా చూపే అనవాయితీకి తెరదించాయి.
- ఒకే ఒక జోన్‌గా ఉన్న తెలంగాణ రెండు జోన్లుగా విడిపోయింది.
- 15 సంవత్సరాల స్థిరనివాస పరిమితిని నాలుగేండ్లకు తగ్గించారు.
- తెలంగాణ ప్రాంతీయ మండలి రద్దయింది.

ఆరుసూత్రాల పథకం ఆధారంగా జారీ అయిన రాష్ట్రపతి ఉత్తర్వుల్లో ఒకవైపు స్థానికులకు ఉద్యోగాలలో రిజర్వేషన్లు కల్పిస్తూనే మరొకవైపు సెక్రటేరియట్,శాఖాధిపతుల కార్యాలయాలు, రాష్ట్రస్థాయి కార్యాలయాలు,కార్పొరేషన్లు, బోర్డులు, ప్రభుత్వరంగ సంస్థలు, ప్రభుత్వ ఎయిడెడ్ సంస్థలు, యూనివర్శిటీలకు స్థానిక రిజర్వేషన్లు వర్తించకుండా మినహాయించారు. ఈ కారణంగా పైన చెప్పిన సంస్థల్లో తెలంగాణాకు ప్రాతినిధ్యమే లేకుండా పోయింది. ప్రభుత్వ యంత్రాంగంలో కోస్తా ఆంధ్రా ఆధిపత్యం వ్యవస్థీకృతం అయ్యింది. వ్యవకృతమైన కోస్తా ఆధిపత్యం వల్ల అన్ని రంగాలలో తెలంగాణ వివక్షకు, నిర్లక్ష్యానికి గురి అయ్యింది. ముఖ్యంగా నీళ్ళు, నిధులు, నియామకాలలో తెలంగాణ అన్యాయానికి బలి అయ్యింది.

## రాష్ట్రపతి ఉత్తర్వుల ఉల్లంఘనలు :

ఆరు సూత్రాల పథకంలో భాగంగా రాష్ట్రపతి ఉత్తర్వులు జారీ అయినాయి గాని ఉల్లంఘనల పరంపర మాత్రం ఆగిపోలేదు.

రాష్ట్రపతి ఉత్తర్వులను ఉల్లంఘించి 1975 నుండి 1985 నాటికి అంటే పదేళ్ళలోనే తెలంగాణలో అక్రమంగా చొరబడిన స్థానికేతరుల సంఖ్య 58 వేల ఉందంటే పరిస్థితి తీవ్రత అర్థమవుతుంది. ఈ ఉల్లంఘనల్ని సవరించి, అక్రమ చొరబాటుదారులను వెనక్కి పంపి, ఆ ఖాళీలలో తెలంగాణ వారిని భర్తీ చెయ్యాలని జీవో 610 చెబుతున్నది. మూడు నెలల్లో అమలుకావాల్సిన జీవో 23 సంవత్సరాలైన అమలు కాలేదు. అమలుచెయ్యడానికి వలస ప్రభుత్వాలు పెనుగులాడుతున్నాయి. వక్రీకరించి కొత్త జీవోలు సర్క్యులర్లు జారీ చేస్తున్నాయి. 610 జీవో అమలు పేరిట మళ్లీ తెలంగాణ వారినే బదిలీ చెస్తున్నారు. విభజించి పాలించు అన్న వలసవాదుల సిద్ధాంతాన్ని ఆంధ్రా వలసవాదులు తూ.చ. తప్పకుండా అమలుచేసి తెలంగాణ జిల్లాల మధ్య బేధాభిప్రాయాలను సృష్టిస్తున్నారు. 610 జీవో అమలుపేరిట ఆ జీవోను భూస్థాపితం చేసేందుకు, రాష్ట్రపతి ఉత్తర్వుల స్ఫూర్తికి విరుద్ధంగా జీవో 72, 399, 415 లను జారీ చేసి తెలంగాణ ఉద్యోగుల సంఘం చేసిన పోరాటం వల్ల వెంటనే రద్దు చేసుకున్నది. ఆఖరుకు కొండను తవ్వి ఎలుకను కూడా పట్టనట్లు నవంబరు 2009లో ప్రభుత్వం తేల్చినదేమంటే 12 లక్షల ప్రభుత్వ ఉద్యోగులుంటె అందులో నాలుగున్నర లక్షల ఉద్యోగుల వివరాలు మాత్రమే పరిశీలించామని, 67 వేల మంది ఉద్యోగుల వివరాలు ప్రభుత్వం వద్దలేవని, 18 వేల మంది ఉద్యోగులను స్థానికేతరులుగా గుర్తించామని వారిని త్వరలో వెనక్కి పంపుతామని ప్రకటించి ప్రభుత్వం చేతులు దులుపుకున్నది. 610 జీవో ఫైలును శాశ్వితంగా మూసివేసింది. వివిధ ప్రభుత్వ శాఖలు వందలాది రిపాట్రియేషన్ జీవోలు జారీ చేసినప్పటికీ ట్రిబ్యునల్ వీటన్నింటికి స్టేలు మంజూరు చేయడంతో ఎక్కడివారక్కడ్నే ఉండిపోయారు. సంవత్సరం గడిచిపోయినా ప్రభుత్వశాఖలు ఆ స్టేలను తొలగించడానికి ఏ చర్య తీసుకోవడం లేదు. ఇదీ 610 జీవో అమలు పరిస్థితి. ఈ చారిత్రక నేపథ్యంలో ముల్కీరూల్సు, ఆరుసూత్రాల పథకాన్ని మరోసారి విశ్లేషించుకోవాల్సి ఉంది.

## ఆరు సూత్రాల పథకంలో ఆరుసూత్రాలు ఏమిటి?

1. వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి కోసం, రాష్ట్రం రాజధాని నగరం అభివృద్ధి కోసం ప్రత్యేక నిధులు కేటాయించి అభివృద్ధిని వేగవంతం చెయ్యాలి. రాష్ట్రస్థాయిలో ఒక ప్లానింగ్ బోర్డును వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి కోసం సబ్‌కమిటీలను ఏర్పాటు చేసి అభివృద్ధి ప్రక్రియను పర్యవేక్షించాలి.
2. రాష్ట్రవ్యాప్తంగా ఒకే రకమైన విద్యా విధానాన్ని ప్రవేశపెట్టి విద్యాసంస్థల్లో స్థానిక విద్యార్థులకు అధిక ప్రాధాన్యతనిచ్చి ప్రవేశాలు కల్పించాలి. హైదరాబాద్ నగరంలో కేంద్రీయ విశ్వవిద్యాలయాన్ని స్థాపించి ఈ ప్రాంత విద్యా సౌకర్యాలను మెరుగుపరచాలి.



3. రాష్ట్ర పరిపాలనావసరాలకు అనుగుణంగా ప్రత్యేకంగా పేర్కొన్న ఉద్యోగాలలో, ప్రత్యేకంగా పేర్కొన్న మేరకు స్థానికులకు ప్రాధాన్యత ఇవ్వాలి. అవి ఏమనగా (1) నాన్-గజెటెడ్ ఉద్యోగాలు (సెక్రటేరియట్, శాఖాధిపతుల కార్యాలయాలు, ఇతర రాష్ట్రస్థాయి కార్యాలయాలు, హైదరాబాద్ సిటీ పోలీసుశాఖలను మినహాయించి) (2) స్థానిక సంస్థల్లో నాన్‌గెజిటెడ్ ఉద్యోగాలు (3) తహసీలుదారు, జూనియర్ ఇంజనీరు, సివిల్ అసిస్టెంట్ సర్జన్ మొ॥ పోస్టులు.

   ప్రమోషన్స్ కొరకు స్పెసిఫైడ్ గజిటెడ్, మొదటి మరియు రెండవ గజిటెడ్ స్థాయి ఉద్యోగాలకు లోకల్ క్యాడర్లుగా వర్గీకరించాలి.
4. సర్వీసు విషయాలలో నియామకాలు, సీనియారిటీ, ప్రమోషన్లు తదితర వివాదాలను పరిష్కరించేందుకు హైకోర్టు అధికారాలున్న అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్ ఏర్పర్చాలి. ట్రిబ్యునల్ తీర్పులకు రాష్ట్ర ప్రభుత్వం విధిగా కట్టుబడి ఉండాలి.
5. పై అంశాలకు చట్టబద్ధత కల్పించేందుకు రాజ్యాంగాన్ని తగు విధంగా సవరించాలి. పై అంశాలపై తగిన విధంగా ఉత్తర్వులు జారీ చేసేందుకు రాష్ట్రపతికి అధికారం లభిస్తుంది.
6. పైన వివరించిన సూత్రాల అమలు వలన ముల్కీ రూల్సు మరియు ప్రాంతీయ కమిటి కొనసాగింపు అనవసరమైపుతాయి.

పైన వివరించిన ఆరు సూత్రాలలో మొదటి ఐదు సూత్రాలు మాత్రమే కార్యాచరణకు సంబంధించినవి. ఆరవసూత్రం మొదటి ఐదు సూత్రాల అమలుతో ముడిపడిన అంశం. ఇపుడు మొదటి ఐదు సూత్రాలు ఎట్లా అమలయినాయి. అవి ఏ మేరకు తమ లక్ష్యాలని నెరవేర్చినాయో విశ్లేషించి ఆరవ సూత్రం యొక్క ప్రాముఖ్యతని, ఇవ్వాల్టి సందర్భాలలో దీని ప్రాసంగికతను విశ్లేషించుకుందాం.

1. ఒకటవ సూత్రంలో చెప్పినట్లు వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి కోసం ప్రత్యేక నిధులు కేటాయించి అభివృద్ధిని వేగవంతం చెయ్యాలి. తెలంగాణ మిగతా ప్రాంతాలతో పోల్చి చూసినపుడు అన్ని రంగాలలో వెనుకబడిన ప్రాంతమే. ముఖ్యంగా సాగునీటి రంగం, విద్యారంగాలలో తెలంగాణ వెనుకబాటుతనం కొట్టవచ్చినట్లు కనబడుతుంది. 1975 నుండి ఇప్పటిదాకా తెలంగాణ అభివృద్ధి కోసం ప్రత్యేక నిధుల కేటాయింపు అటుంచితే అభివృద్ధి క్రమం మరింత మందగించింది. వ్యవసాయరంగం తీవ్ర సంక్షోభంలోకి నెట్టివేయబడింది. విలీనానికి ముందు తెలంగాణలో చెరువుల కింద సాగే వ్యవసాయం చెరువులను నిర్లక్ష్యం చేసినందువల్ల తీవ్రంగా దెబ్బతిన్నది. విలీనం నాటికి తెలంగాణలో చెరువుల కింద 12 లక్షల ఎకరాలు సాగువుతుంటే 2004 నాటికి 3 లక్షల ఎకరాలకు పడిపోయింది. వ్యవసాయం మీద ఆధారపడిన లక్షలాది జనం దేశాలు పట్టి వలసలు పోయినారు. ఒక్క మహబూబ్‌నగర్ జిల్లా నుంచే 16 లక్షల మంది ప్రజలు గ్రామాలు వదలి వలసలు పోయినట్లు అంచనాలున్నాయి. చెరువులు, వ్యవసాయం చుట్టూ అల్లుకొని ఉన్న కులవృత్తులూ ధ్వంసం

అయిపోయినాయి. ఆ వృత్తుల మీద బతుకులు వెళ్ళదీసిన జనం బతుకులు ధ్వంసం అయినాయి. గత పదేళ్ళలో రాష్ట్రంలో జరిగిన రైతుల ఆత్మహత్యలలో 80% తెలంగాణలో జరిగినవే. సాగునీటి సౌకర్యాల నిష్పత్తి విలీనం నాటికి ఆంధ్ర తెలంగాణల మధ్య 1.7:1 ఉంటే 2004 నాటికి అది 3.8 :1 కి పెరిగిపోయింది. సహకార బ్యాంకుల ద్వారా తెలంగాణకు అందిన రుణాలు 28% ఉంటే ఆంధ్రలో అది 72 % ఉన్నది.

విద్యారంగంలో తెలంగాణపట్ల ప్రభుత్వానిది వివక్షా పూరిత విధానమే. వివిధ ప్రాంతాలలో యూనివర్శిటీలకు ప్రభుత్వం ఇస్తున్న గ్రాంటులను చూస్తే ఈ వివక్ష తెల్సిపోతుంది. ఇది ఒక ఉదాహరణ మాత్రమే.

| | |
|---|---|
| **రాయలసీమ ప్రాంతం** | **గ్రాంటు ఒక్క విద్యార్థికి** |
| శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ | రూ. 37,500 |
| కృష్ణదేవరాయ యూనివర్సిటీ | రూ. 25,000 |
| **కోస్తాంధ్ర ప్రాంతం** | |
| ఆంధ్ర యూనివర్సిటీ | రూ. 35,500 |
| నాగార్జున యూనివర్సిటీ | రూ. 22,700 |
| **తెలంగాణ ప్రాంతం** | |
| ఉస్మానియా యూనివర్సిటీ | రూ. 17,400 |
| కాకతీయ యూనివర్సిటీ | రూ. 14,00 |

యూనివర్సిటీల స్థాపనను గమనిస్తే... 4 జిల్లాలున్న రాయలసీమలో 10 యూనివర్సిటీలు, 10 జిల్లాలున్న తెలంగాణలో 4 యూనివర్సిటీలు. ఇదీ పాలకుల వివక్ష.

ఎయిడెడ్ డిగ్రీ కాలేజీలకు ప్రభుత్వం ఇచ్చిన గ్రాంటు రాయలసీమ ఆంధ్రాకు 75.93% అయితే తెలంగాణకు 24.07% మాత్రమే.

అయితే రాజధాని నగరంలో వలసవాదులు అడ్డా బిఠాయించిన ప్రాంతాలైన బంజారాహిల్స్, జుబ్లీహిల్స్ ప్రాంతాలను మాత్రం అభివృద్ధి పర్చి మిగతా నగరాన్ని మురికి కూపంగా మార్చి, ఇవాళ తామే హైదరాబాద్ నగరాన్ని అభివృద్ధి పరచామని గప్పాలు కొడుతున్నారు. ఈ విధంగా ఆరుసూత్రాలలో మొదటిది అత్యంత ముఖ్యమైంది పూర్తిగా నిర్వీర్యమైంది.

2. రెండవ సూత్రంలో చెప్పినట్లు హైదరాబాద్‌లో కేంద్రీయ విశ్వవిద్యాలయం అయితే ఏర్పాటయింది గాని అది ఈ ప్రాంతంలో విద్యా సౌకర్యాలను మెరుగుపర్చడంలో ఏ పాత్ర పోషించలేదు. విద్యాభివృద్ధికి ఏ విధంగానూ దోహదం చేయలేదు. యూనివర్శిటీలోని అధ్యాపక పోస్టులు ఇతర ఉద్యోగాలు అన్నీ తెలంగాణేతరుల



వశమైనాయి. విశ్వవిద్యాలయంలో ప్రవేశానికి తెలంగాణ విద్యార్థులకు ఏ ప్రాధాన్యత లేదు. అందువల్ల విశ్వవిద్యాలయం తన లక్ష్యాలను సాధించడంలో పూర్తిగా విఫలమైంది. దీనికి తోడు హైదరాబాద్ నగరంలో ఉన్న ఉస్మానియా విశ్వవిద్యాలయం సహా అన్ని కాలేజీలలో స్థానికేతరులు చొరబడి పోతున్నారు. ఎందుకంటే ఆరుసూత్రాల పథకం ప్రకారం హైదరాబాద్‌లో 4 ఏళ్ళ స్థిరనివాసం ఉన్న ఆంధ్రులను స్థానికులుగా మార్చివేస్తుంది. అంతకుముందు హైదరాబాద్ నగరంలోని విద్యా సౌకర్యాలు తెలంగాణ విద్యార్థులకు అందుబాటులో ఉండేవి. ఆరుసూత్రాల పథకం కారణంగా అవి ఎండమావులుగా మారిపోయినాయి. ఈ విధంగా రెండో సూత్రం ఎందుకు పనికిరాని సూత్రంగా మారిపోయింది.

3. ఇక మూడోసూత్రం ఉద్యోగాలకు సంబంధించినది. స్పెసిఫైడ్ గజిటెడ్, ఒకటవ, రెండవ గజిటెడ్ స్థాయి ఉద్యోగాలలో, కొన్ని పేర్కొన్న ఉద్యోగాలలో, నాన్‌గజిటెడ్ ఉద్యోగాలలో స్థానికులకు రిజర్వేషన్లు కల్పించారు. రాష్ట్రపతి ఉత్తర్వుల్లో ఈ విషయాలన్నీ పొందుపర్చారు.

32వ రాజ్యాంగ సవరణ ద్వారా ఆర్టికల్ 371డి ని ప్రత్యేకంగా రాజ్యాంగంలో చేర్చారు. ఆర్టికల్ 371 డి ఏం చెబుతుందంటే

"Article 371 D: Special Provisions with respect to the state of Andhra Pradesh, the President may order made with respect to the state of A.P. Provide having, regard to the requirements of the state as whole, for equitable opportunities and facilities for the people belonging to different parts of the state in the matter of public employment and in the matter of education and different provision may be made for various parts of the state"

ఆర్టికల్ 371డి దఖలు పర్చిన అధికారాలతో రాష్ట్రపతి ఉత్తర్వులు 18-10-1975న జారీ అయినాయి. దీన్నే "The Andhra Pradesh Public Employment (organisation of local cadres and regulation of Direct recruitment) order 1975" గా పిలుస్తారు. ఈ ఉత్తర్వుల ఆధారంగా జీ.వో.ఎం.ఎస్.నెం. 674 తేది : 20-10-1975న ప్రభుత్వం జారీ చేసింది. స్థూలంగా రాష్ట్రపతి ఉత్తర్వుల్లోని అంశాలు ఇవి.

1. రాష్ట్రాన్ని మొత్తం 6 జోన్లుగా ఈ క్రింది విధంగా విభజించారు.

| | |
|---|---|
| జోన్ 1 | శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం. |
| జోన్ 2 | తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా |
| జోన్ 3 | గుంటూరు, ప్రకాశం, నెల్లూరు |
| జోన్ 4 | చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు |
| జోన్ 5 | ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం |

జోన్ 6 హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, మహబూబ్‌నగర్, మెదక్, నల్లగొండ.

2. జిల్లా పోస్టుల్లో 80%, నాన్‌గెజిటెడ్ జోనల్ పోస్టుల్లో 70%, స్పెసిఫైడ్ గజిటెడ్ పోస్టులో 60% స్థానికులకు రిజర్వేషన్ కల్పించారు. మిగతావి ఓపెన్ మెరిట్ ద్వారా భర్తీ చెయ్యాలి. ఇవి అన్‌రిజర్వ్‌డ్‌గా పరిగణించాలి.

3. నాల్గవ తరగతి నుండి పదవ తరగతి వరకు వరుసుగా నాలుగేళ్లు ఎక్కడ చదివితే ఆ వ్యక్తిని అక్కడి స్థానికుడిగా పరిగణిస్తారు.

4. రాష్ట్రపతి ఉత్తర్వుల పరిధి నుండి సెక్రటేరియట్, శాఖాధిపతుల కార్యాలయాలు, ఇతర రాష్ట్రస్థాయి కార్యాలయాలు, కార్పొరేషన్లు, బోర్డులు, ప్రభుత్వరంగ సంస్థలు, ప్రభుత్వ గ్రాంటు పొందే సంస్థలు, విశ్వవిద్యాలయాలను మినహాయించినారు. అంటే ఇక్కడ స్థానిక రిజర్వేషన్లు వర్తించవు. అయినప్పటికీ ఆర్టికల్ 371 డి స్ఫూర్తితో ఈ అన్ని కార్యాలయాలలో అన్ని ప్రాంతాల లోకల్ క్యాడర్లకు ఫెయిర్ షేర్ సూత్రాన్ని అమలుచెయ్యాలి.

1975 లో జారీ అయిన రాష్ట్రపతి ఉత్తర్వులు ముల్కీరూల్సు మాదిరిగానే యథేచ్ఛగా ఉల్లంఘనకు గురి అయినాయి. 1985లో 610 జీవో జారీ చేసేనాటికే రాష్ట్రపతి ఉత్తర్వులకు విరుద్ధంగా 58 వేల మంది తెలంగాణలో నియమించబడినారని శ్రీ జయభారత్‌రెడ్డి కమిటి నిర్ధారించింది. వీరిని వెనక్కి పంపి ఆ ఖాళీలో స్థానికులను భర్తీ చెయ్యాలని 610 జీవోలో ప్రభుత్వం ఆదేశాలు జారీ చేసింది. మూడు నెలల్లో అంటే మార్చి 1986 నాటికే అమలుకావాల్సిన జీవో 23 సంవత్సరాల తర్వాత ఇంకా వివాదాలకి కారణమవుతున్నది. 1985 లో 610 జీవో అమలు కాకపోగా ఉల్లంఘనల పరంపర కొనసాగింది. ఇంకా కొనసాగుతున్నది. ఈ క్రమంలో ఈ అక్రమ చొరబాటుదారుల సంఖ్య నేటికి 2 లక్షలకు పైనే ఉంటుందని అంచనా.

రాష్ట్రపతి ఉత్తర్వుల పరిధిలో లేనటువంటి కార్యాలయాలలో ఫెయిర్‌షేర్ సూత్రాన్ని పాటించకపోవడం వల్ల సచివాలయంలో 9% శాఖాధిపతుల కార్యాలయాల్లో 16% ప్రభుత్వరంగ సంస్థల్లో 20% మాత్రమే తెలంగాణ ఉద్యోగులు ఉన్నారని అంచనా. ఈ కార్యాలయాలన్నీ కోస్తామయం అయి పాలనా యంత్రాంగంలో కోస్తా ఆంధ్రా ఆధిపత్యం కేంద్రీకృతమైంది. రాష్ట్రపాలనా వ్యవస్థలో తెలంగాణకు నామమాత్రపు ప్రాతినిధ్యం వల్లనే తెలంగాణ ప్రాంతం అభివృద్ధిలో, నిధుల కేటాయింపులో వివక్షకు నిర్లక్ష్యానికి గురి అయ్యింది. రాష్ట్ర ఆదాయానికి తెలంగాణ ప్రాంతం ఇచ్చింది ఎంత? పొందింది ఎంత? ఈ పట్టికలో పొందుపరిచాయి. ఇది అసెంబ్లీలో అప్పటి రాష్ట్ర ఆర్థికమంత్రి, ఇప్పటి ముఖ్యమంత్రి శ్రీ. రోశయ్యగారు ఒక ప్రశ్నకు ఇచ్చిన సమాధానం.



## REGION WISE COMPARATIVE STATEMENT OF REVENUE (INCOME) AND EXPENDITURE OF ANDHRA AND TELANGANA

| Region | 2003-04 | | 2004-05 | | 2005-06 | | 2006-07 | |
|---|---|---|---|---|---|---|---|---|
| | Revenue | Expend | Revenue | Expend | Revenue | Expend | Revenue | Expend |
| | | | | ANDHRA | | | | |
| Coastha | 2796 | 3848 | 3494 | 3799 | 3702 | 4532 | 3690 | 3489 |
| **% Coastha** | **16.06** | **32.43** | **16.89** | **30.93** | **15.16** | **29.61** | **14.71** | **26.75** |
| Rayalseema | 703 | 2150 | 867 | 2411 | 1004 | 2684 | 987 | 2881 |
| **% of Rayalseem** | **4.03** | **18.12** | **4.19** | **19.06** | **4.11** | **17.53** | **3.93** | **22.09** |
| **Andhra Total** | **3526** | **5998** | **4361** | **6210** | **4706** | **7216** | **4677** | **6370** |
| **% Of Andhra** | **25.25** | **50.56** | **21.08** | **49.10** | **19.28** | **47.15** | **18.65** | **48.85** |
| | | | | TELANGANA | | | | |
| **Telanga Total** | **10660** | **5964** | **13036** | **6430** | **15643** | **8087** | **15412** | **6669** |
| **% of Telangana** | **61.24** | **50.44** | **63.03** | **50.90** | **64.10** | **52.85** | **61.47** | **51.85** |
| Others | 3220 | ... | 3283 | ... | 4055 | ... | 4980 | |
| % | 18.49 | ... | 15.87 | ... | 16.61 | ... | 19.86 | |
| **GRAND TOTAL** | **17406** | **11862** | **20680** | **12649** | **24404** | **15303** | **25069** | **13039** |
| % | **100** | **100** | **100** | **100** | **100** | **100** | **100** | **100** |

Expednitured towards year wise plan expenditure.

Source : Answer by given Sri. K. Rosiah, the then Minsiter for Finance and Small Saving to LAQ No. 7406.

తెలంగాణ పట్ల వివక్షకు ఇంత కంటే సాక్ష్యం ఇంకేం కావాలి.

రాష్ట్రపతి ఉత్తర్వులు ఎట్లా ఉల్లంఘనకు గురి అయినాయో, రాష్ట్రపతి ఉత్తర్వులను ఎట్లా వక్రీకరించుకొని నియామకాలు, బదిలీలు, డిప్యూటేషన్లు జరుపుకున్నారో గిర్‌గ్లానీ కమీషన్ సవివరంగా తమ తుది నివేదికలో పొందుపర్చింది. **రాష్ట్రపతి ఉత్తర్వుల ఉల్లంఘన అంటే రాజ్యాంగ ఉల్లంఘనతో సమానం.** ఇంతటి ఉల్లంఘనలు జరగటం అంటే ఆరుసూత్రాల ఒప్పందానికి అర్థం లేదు. ఇట్లాంటి ఉల్లంఘనలు రాష్ట్ర సమగ్రతకే ముప్పు అని గిర్‌గ్లాని తన నివేదికలో వ్యాఖ్యానించారు. గిర్‌గ్లాని నివేదిక ప్రకారం ఆరుసూత్రాలలో అత్యంత ముఖ్యమైన మూడోసూత్రం ఒక బూటకంగా మారింది. రాజ్యాంగ ఉల్లంఘనకు సాక్ష్యంగా మన ముందు నిలబడి ఉంది.

4. నాల్గవ సూత్రం ప్రకారం రాష్ట్రంలో అడ్మిన్‌స్ట్రేటివ్ ట్రిబ్యునల్ ఏర్పడింది. నాల్గవ సూత్రంలో పేర్కొన్నట్లు ట్రిబ్యునల్ ఇచ్చిన తీర్పులకు రాష్ట్రప్రభుత్వం కట్టుబడి ఉండాలి. అయితే తెలంగాణ ఉద్యోగులకు అనుకూలంగా వచ్చిన వేలాది తీర్పులను ప్రభుత్వం బుట్టదాఖలు చేసి ట్రిబ్యునల్‌ని అపహాస్యం చేసింది. చాలా కేసులలో తెలంగాణ ఉద్యోగులకు ట్రిబ్యునల్‌లోనే చుక్కెదురయ్యింది. రాష్ట్రపతి ఉత్తర్వులను పరిరక్షించడంలో ట్రిబ్యునల్ వైపల్యం చెందింది. ఇటీవలి 610 జీవో బదిలీల మీద ఇచ్చిన స్టేలే అందుకు సాక్ష్యం. ఈ విధంగా నాల్గో సూత్రం అమలుయినట్లు బయటకు కనిపిస్తున్నా ఆచరణలో అంతిమంగా వైఫల్యం చెందింది.

5. ఐదవ సూత్రం ప్రకారం మొదటి నాల్గు సూత్రాలను చట్టబద్ధం చేయడానికి 32వ రాజ్యాంగ సవరణ ద్వారా ఆర్టికల్ 371-డిని రాజ్యాంగంలో పొందుపరిచారు. తదనంతరమే రాష్ట్రపతి ఉత్తర్వులు వెలువడినాయి. అయినప్పటికీ నాల్గు సుత్రాలు అవి ఉద్దేశించిన లక్ష్యాలను సాధించడంలో ఘోరంగా విపలం అయినాయి. అందువల్ల ఈ ఐదవ సూత్రం ప్రకారం జరిగిన రాజ్యాంగ సవరణలకు ఏ విలువా లేకుండా పోయింది. తెలంగాణాకు కల్పించిన రాజ్యాంగ రక్షణలు అబాసుపాలయినాయి.

6. ఇక ఆరవ సూత్రం చెబుతున్న ప్రకారం మొదటి 5 సూత్రాలు అమలవుతే ముల్కీ రూల్సు మరియు ప్రాంతీయ కమిటీ అవసరం లేనివి అవుతాయి. ఈ వెసులుబాటుతో ముల్కీ రూల్సు, ప్రాంతీయ అభివృద్ధి కమిటీని వెంటనే రద్దు చేశారు. దీన్ని మరో రకంగా విశ్లేషించుకుంటే మొదటి 5 సూత్రాలు అమలుకాని పక్షంలో ముల్కీ రూల్సు, ప్రాంతీయ కమిటి అవసరం అవుతాయి. మొదటి 5 సూత్రాలు అమలు కావడంలో ఎంతగా వైఫల్యం చెందినాయో చూసాం. ఐదు సూత్రాలు ఆచరణలో వైఫల్యం చెందిన కారణంగా ఆరవ సూత్రంలో చెప్పినట్లు ముల్కీరూల్సును, ప్రాంతీయ కమిటీని పూర్వపు అధికారాలతో పునరుద్ధరించవలసి ఉన్నది. 1972లో సుప్రీంకోర్టు ధర్మాసనం ముల్కీ రూల్సు రాజ్యాంగబద్ధమేనని తీర్పు ఇచ్చినందువల్ల, సుప్రీంకోర్టు తీర్పు ఇవ్వాళ ఒక ప్రాసంగికతను సంతరించుకున్నది. ఆరు సూత్రాల పథకం అమలుకాకపోవడం వల్ల ముల్కీ రూల్సుని, ప్రాంతీయ కమిటీని 1975కు ముందున్నట్లుగా తిరిగి పునరుద్ధరించవలసిన ఆగత్యం కేంద్ర ప్రభుత్వానికి ఉన్నది.



ఇవ్వాళ తెలంగాణ ప్రజానీకం ముల్కీరూల్సుని, పూర్వపు అధికారాలతో ప్రాంతీయ కమిటీని పునరుద్ధరించమని డిమాండ్ చెయ్యవల్సి వస్తున్నది.

ముల్కీరూల్సుకు కాలం చెల్లిందని, కాలం చెల్లిన ముల్కీరూల్సుని పునరుద్ధరించమని డిమాండ్ చెయ్యడం పట్ల ఆంధ్ర ప్రాంత ఉద్యోగ సంఘాలు, మేధావులు విస్మయాన్ని వ్యక్తం చేస్తున్నారు. ముల్కీ రూల్సు రద్దయినప్పటికీ వాటికి కాలం చెల్లలేదని మేం భావిస్తున్నాం. నిజానికి ఎన్నడూ లేనంతగా ఈనాడే ముల్కీ రూల్సు అవసరం ఉందని మేం స్పష్టం చేస్తున్నాం.

ముల్కీ రూల్సు పునరుద్ధరించమని అడగమన్నా, 610 జీవో అమలు చెయ్యమన్నా, ఆర్టికల్ 371 డి ప్రకారం ఉద్యోగాల్లో సమాన అవకాశాలు కల్పించడమన్నా పాలనా యంత్రాంగంలో తెలంగాణకు న్యాయబద్ధమైన వాటాను కోరడమే. పాలనా యంత్రాంగంలో న్యాయబద్ధమైన వాటా ప్రజల సహజ సిద్ధహక్కు. ఆ హక్కును ఆంధ్రాపాలకవర్గాలు తెలంగాణకు నిరాకరిస్తున్నాయి. కనుకనే ఇవ్వాళ ముల్కీ రూల్సు పునరుద్ధరణ డిమాండు ముందుకు వచ్చింది. ఇవ్వాళ కాలం చెల్లింది ఆరుసూత్రాల పథకానికే గాని ముల్కీ రూల్సుకి కాదు. రాష్ట్రపాలనా యంత్రంగాలో తెలంగాణకు న్యాయబద్ధమైన వాటా దొరకనంత కాలం ముల్కీ రూల్సుకు కాలం చెల్లదు. ఈ 50 ఏళ్ల సమైక్య రాష్ట్ర అనుభవం వల్ల ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణకు న్యాయం కల్ల అని తెలిపోయింది. కనుకనే తెంగాణ ప్రజలు ప్రత్యేక రాష్ట్రాన్ని డిమాండ్ చేస్తూ ఉద్యమిస్తున్నారు. అభివృద్ధి మా ప్రజాస్వామిక హక్కు - స్వయం పాలన మా జన్మ హక్కు అని నినదిస్తున్నారు.

రేపు తెలంగాణ ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్ష అయిన ప్రత్యేక రాష్ట్రం ఏర్పడినా ముల్కీ రూల్సు అవసరమవుతాయి. అందుకనే ముల్కీ రూల్సు పునరుద్ధరణ డిమాండ్‌ను సమర్థించవలసిందిగా తెలంగాణ రాజకీయ నాయకులు, మేధావులు, రచయితలు, కవులు, కళాకారులు, విద్యార్థులు ఇతర సెక్షన్ల ప్రజలకు మేం విజ్ఞప్తి చేస్తున్నాం. ఈ డిమాండ్‌ను ప్రజల డిమాండ్‌గా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు తీర్మానాల రూపంలో పంపవల్సిందిగా సమస్త ప్రజలకు, ప్రజాప్రాతినిధ్య సంస్థలకు ప్రజా సంఘాలకు విజ్ఞప్తి చేస్తున్నాం.

* * * * *

## ఉపయుక్త గ్రంధాలు


1. తెలంగాణ రాష్ట్రం ఒక డిమాండ్ - ప్రొ.కె. జయశంకర్
2. ప్రత్యేక తెలంగాణ ఉద్యమాల చరిత్ర - శోభాగాంధి
3. నీళ్లు - నిజాలు - ఆర్. విద్యాసాగర్ రావు
4. తెలంగాణ డైరీ 2009 - తెలంగాణ ఉద్యోగుల సంఘం
5. తెలంగాణ రాష్ట్రోద్యమాల చరిత్ర - ఆదిరాజు వెంకటేశ్వరరావు
6. Revival of Mulki Rules & Regional committee - A document prepared by Prof. Sridhara Swamy.
7. SRC Report 1955.

# ఫ్రీ జోన్ భావన రాష్ట్రపతి ఉత్తర్వులకు విరుద్ధం

- సి. విఠల్ & శ్రీధరరావు దేశ్‌పాండే

'హైదరాబాద్ ఫ్రీ జోన్' అని పేర్కొంటు అక్టోబరు 9, 2009న సుప్రీంకోర్టు తీర్పు వెలువరించిన అనంతరం రాష్ట్రంలో రాజకీయం వేడెక్కింది. ఫ్రీ జోన్ తీర్పు సహజంగానే తెలంగాణ ఉద్యోగులను. నిరుద్యోగులను కలవరానికి గురిచేసింది. అక్టోబరు 10వ తేదీ నుండే ఉద్యోగ సంఘాలు చురుకుగా కదలి సుప్రీంకోర్టు తీర్పును నిరసిస్తూ కార్యక్రమాలు రూపొదించాయి. సుప్రీంకోర్టు తీర్పు కాపీ ఇంకా అందనే లేదు. తీర్పును అధ్యయనం చేయకుండానే ఆందోళనా కార్యక్రమాలు చేపట్టవలసి వచ్చింది. ఎందుకంటే పోలీసు డిపార్టుమెంటుకు మాత్రమే వర్తించే తీర్పును అన్ని శాఖలకు వర్తింపజేసే ప్రమాదం ఉందని, అటువంటి ప్రమాదాన్ని నివిరించేందుకే వెంటనే నిరసన కార్యక్రమాలకు తెలంగాణ ఉద్యోగ సంఘాలు దిగాయి. ప్రమాదాన్ని శంకించినట్లుగానే కోస్తా నాయకుడు హరిరామ జోగయ్య ఫ్రీ జోన్ తీర్పును అన్ని శాఖలకు వర్తింపజేయాలని డిమాండ్ చెయ్యనే చేసాడు.

2006లో కూడా ఇటువంటి వివాదం తలెత్తింది. ఈసారి కాంగ్రెస్ నాయకత్వం వ్యూహాత్మక మౌనం పాటిస్తున్నా 2006లో తలెత్తిన వివాదంలో సీమాంధ్ర కాంగ్రెస్ నాయకులే ప్రధానపాత్ర పోషించారు. ఆనాటి వివాదాన్ని కొద్దిగా పునశ్చరణ చేసుకుందాం. గ్లిర్‌గ్లానీ సిఫారసులను, 610 జీవోను యధాతథంగా అమలుచేయాలని వైఎస్ ప్రభుత్వం నిర్ణయించింది. వెంటనే కోస్తా, రాయలసీమ నాయకులు గాదె వెంకటరెడ్డి నాయకత్వంలో 610 జీవోను అమలుచేసినప్పటికీ హైదరాబాద్ నగరాన్ని 'ఫ్రీ జోన్'గా పరిగణించాలని ప్రభుత్వాన్ని కోరుతూ ముఖ్యమంత్రికి విజ్ఞాపన సమర్పించారు. గిర్‌గ్లానీ తన పరిధికి మించి సిఫారసులు చేశాడని అందువల్ల గిర్‌గ్లానీ సిఫారసులను పునస్సమీక్షించాలని వివాదాస్పద వ్యాఖ్యలు చేయడం ప్రారంభించారు. కోస్తా ప్రాంత ఎమ్మెల్యేలు సమావేశాలు జరపడం, ఆంధ్రా ఉద్యోగ సంఘాల సదస్సుల్లో ప్రసంగించడం, పత్రికల్లో రోజూ తాటికాయంత అక్షరాలతో హైదరాబాద్ ముమ్మాటికి ఫ్రీ జోనే లాంటి హెడ్డింగులతో వార్తలు రాయించుకోవడం ఉధృతమైంది. ఈ అసత్యపు,



అబద్దపు, కుట్రపూరిత ప్రచారాన్ని నిలువరించేందుకు తెలంగాణ ఉద్యోగ సంఘాలు, ప్రజా సంఘాలు ఎదురుదాడికి దిగాయి. రాష్ట్రపతి ఉత్తర్వుల్లో ఎక్కడా 'ఫ్రీ జోన్' అన్నపదం కాని, హైదరాబాద్‌ను ఏడవ జోన్‌గా పేర్కొన్న దాఖలాలు లేవని సాధికారికంగా వాదించాయి. ఈ వాదనలకు సిపిఐ, సిపిఎం, బిజెపి పార్టీల మద్దతు కూడా లభించింది. అనవసరపు వివాదాలు లేవనెత్తవద్దని గాదె వెంకటరెడ్డికి వారు హితవు పలికారు. తెలంగాణ ఉద్యోగుల సంఘం ఈ వివాదంపై ఏర్పాటు చేసిన రౌండ్ టేబుల్ సమావేశానికి రాకుండా మొఖం చాటేసిన టిడిపి, టిఆర్‌సిసిలు కూడా హైదరాబాద్ ఆరవజోన్‌లో భాగమని ప్రకటించవలసి వచ్చింది. ఆఖరికి ముఖ్యమంత్రి వై.ఎస్. చర్చలో జోక్యం చేసుకుని హైదరాబాద్ ఫ్రీజోన్ అని ఎవరన్నారు? అని ప్రశ్నించడంతో ఆనాడు ఫ్రీ జోన్ వివాదానికి తెరపడింది. అనంతరం 4.10.2006న జారీ చేసిన సర్క్యులర్ మెమోలో ప్రభుత్వం చాలా స్పష్టంగా 'ఫ్రీ జోన్' అంశపై వివరణ ఇచ్చింది. Para 2 (J-3)లో ఈ క్రింది వివరణను ప్రభుత్వం ఇచ్చింది.

"Further, in order to remove misconceptions and mis-definitions, it is clarified that the presidential order has no where defined any 'Free Zone' or Hyderabad city zone. The only specified area in the presidential order is the unit called city of Hyderabad which is constituted by the areas as setout above. The presidential order requires that appointments to certain categories of posts and to the extent mentioned in GSR 528 (E), shall only be from the local candidates from the city of Hyderabad. The term local candidate will be as setout in the presidential order itself."

ఫ్రీ జోన్ వివాదం ముగిసిపోయిందన్న నిశ్చంతలో ఉండగా సుప్రీంకోర్టు డివిజన్ బెంచ్ తీర్పు మళ్లీ ఈ వివాదాన్ని రగిల్చింది. సుప్రీం ఇటువంటి తీర్పు ఇవ్వటానికి ప్రభుత్వం సరిఅయిన తీరులో స్పందించకపోవటమే అన్న అభిప్రాయం సర్వత్రా వ్యక్తమవుతున్నది. హైకోర్టులో సమర్థవతంగా వాదించిన తెలంగాణ ఉద్యోగ సంఘాలు సుప్రీంకోర్టులో మాత్రం ఇంప్లీడ్ కాలేకపోవడంతో పిటిషనర్లు, ప్రభుత్వ కౌంటర్ల మీద సుప్రీంకోర్టు ఆధారపడవలసి వచ్చింది. తీర్పును అధ్యయనం చేసినపుడు సుప్రీంకోర్టు రాష్ట్రపతి ఉత్తర్వుల్లో పేర్కొన్న మినహాయింపులను పరిగణలోనికి తీసుకున్నట్లు కనబడుతున్నది. రాష్ట్రపతి ఉత్తర్వులోని ప్యారా 14లో రాష్ట్రపతి ఉత్తర్వులు వర్తించని కార్యాలయాలను పేర్కొన్నారు. సెక్రటేరియట్, శాఖాధిపతుల కార్యాలయాలు, రాష్ట్రస్థాయి కార్యాలయాలు, సంస్థలు మొదలైనవాటిని పేర్కొంటూ 14 (ఎఫ్)లో ఈ విధంగా పేర్కొన్నారు. "any post police officer as defined in clause (b) of section 3 of Hyderabad city police Act, 1348 F". అంటె రాష్ట్రపతి ఉత్తర్వుల్లోని ప్యారా 14 (ఎఫ్) ప్రకారం హైదరాబాద్ నగర పోలీసు చట్టం ప్రకారం జరిగిన నియమకాలకు మినహాయింపు వర్తిస్తుంది. సుప్రీంకోర్టులో పిటిషనర్లు తాము హైదరాబాద్ నగర పోలీసు చట్టం ప్రకారమే నియామకాలు పొందాము కాబట్టి రాష్ట్రపతి ఉత్తర్వులు తమకు

వర్తించవని వాదించి సుప్రీంకోర్టును నమ్మించగలిగినారు. అయితే హైకోర్టు మాత్రం ఈ వాదనని నమ్మలేదు. ఎందుకంటే రాష్ట్రపతి ఉత్తర్వుల్లోని ప్యారా 11 లో స్పష్టంగా పేర్కొన్నదేమిటంటె రాష్ట్రపతి ఉత్తర్వులకు ముందున్న అన్ని చట్టాలు, నిబంధనలు రద్దయి రాష్ట్రపతి ఉత్తర్వులే అమలులోకి వస్తాయి. పార్యా 11:

Order to have over-riding effect : The provisions of this order shall have effect not withstanding anything contained in any statute, ordinance, rule, regulation or other order made before or after this order in respect of direct recruitment to posts under the state government or any local authority.

అంటె రాష్ట్రపతి ఉత్తర్వులు జారీ అయిన 18-10-1975కు ముందున్న సర్వీసు చట్టాలు, నిబంధనలు అన్నీ రద్దయిపోతాయన్నమాట. అయితే ప్యారా 11లో ఈ రకమైన 'ఓవర్‌రైడింగ్ ఎఫెక్ట్' గురించి పేర్కొని ప్యారా 14 (ఎఫ్) కింద పైన పేర్కొన్న మినహాయింపు ఎందుకు ఇచ్చినట్లు? న్యాయవిశ్లేషకులు భావించేదేమిటంటె 18-10-1975 ముందు హైదరాబాద్ పోలీసు చట్టం ప్రకారం జరిపిన నియామకాలకు రాష్ట్రపతి ఉత్తర్వుల్లోని నిబంధనలు వర్తించకుండా రక్షణలు కల్పించడానికే ప్యారా 14 (ఎఫ్)ని ఉత్తర్వుల్లో పొందుపర్చారు. అంతేకాని 18-10.1975 తర్వాత ఏ నియామకాలైన, ఏ చట్టం ప్రకారంగా జరిగినప్పటికీ రాష్ట్రపతి ఉత్తర్వుల్లోని నిబంధనలు వర్తించక తప్పదు. హైకోర్టు ఫుల్‌బెంచ్ తన తీర్పును ప్రకటిస్తూ హైదరాబాద్ నగర పోలీసు చట్టం 1348(ఎఫ్) ప్రకారం పోలీసు ఆఫీసర్ల నియామకాలు జరిగినట్లు పిటిషనర్లు నిరూపించలేకపోయారు. కనుక రాష్ట్రపతి ఉత్తర్వుల్లోని ప్యారా 14(ఎఫ్) ద్వారా మినహాయింపును పొందడానికి వీలులేదు. అందువల్ల హైదరాబాద్ నగర పోలీసు కమిషనరేట్ పరిధిలో పనిచేసే ఏ పోలీసు అధికారి అయినా ప్రమోషన్ ద్వారా గానీ, నేరుగా గానీ నియామకం పొందినవారు ఆరవజోన్‌కు చెందినవారై ఉండాలి. రాష్ట్రపతి ఉత్తర్వుల్లోని షెడ్యూలు-2 ప్రకారం రాష్ట్రంలో ఆరు జోన్లు మాత్రమే ఉన్నాయి. హైదరాబాద్ నగరాన్ని రాష్ట్రపతి ఉత్తర్వుల్లో ప్రత్యేక జోన్‌గా పరిగణించలేదు. గనుక హైదరాబాద్ నగరం ఆరవ జోన్‌లో భాగమే. ఉద్యోగ నియామకాలు, ప్రమోషన్లు, ట్రాన్సఫర్ల విషయంలో ప్రభుత్వం తప్పనిసరిగా రాజ్యాంగంలోని ఆర్టికల్ 371(డి) (10)ని, రాష్ట్రపతి ఉత్తర్వుల్లోని ప్యారా 11ని దృష్టిలో ఉంచుకొనే చేపట్టాలని హైకోర్టు అభిప్రాయపడింది. సుప్రీంకోర్టు మాత్రం తాము నగర పోలీసు చట్టం 1348 (ఎఫ్) ద్వారానే నియమకాలు పొందాము కాబట్టి రాష్ట్రపతి ఉత్తర్వుల్లోని ప్యారా 14(ఎఫ్) ప్రకారం మినహాయింపుకు అర్హులమే అన్న పిటిషనర్ల వాదనని నమ్ముతూ హైకోర్టు తీర్పును కొట్టివేసింది.

హైకోర్టు తీర్పులోని విశ్లేషణకు, సుప్రీంకోర్టులోని విశ్లేషణకు ఇదే ప్రధాన తేడా అని న్యాయ విశ్లేషకుల భావన. ఏది ఏమైనప్పటికీ ప్రస్తుత తీర్పు కేవలం పోలీసు



డిపార్టుమెంటుకే అదీ హైదరాబాద్ నగర పోలీసు కమీషనరేట్‌కు మాత్రమే వర్తిస్తుంది తప్ప అన్ని శాఖలకు వర్తింపజేయడం కుదరదు. అట్లా చేసినట్లయితే అది రాష్ట్రపతి ఉత్తర్వుల ఉల్లంఘన కిందికి వస్తుంది. రాష్ట్రపతి ఉత్తర్వుల ఉల్లంఘన అంటే రాజ్యాంగ ఉల్లంఘనతో సమానమని గిర్‌గ్లానీ అభిప్రాయపడినాడు. రాష్ట్ర ప్రభుత్వం గతంలో అనేకసార్లు రాష్ట్రపతి ఉత్తర్వులని ఉల్లంఘించి రాజ్యాంగ ఉల్లంఘనకు పాల్పడినా ఇవ్వాళ మరొకసారి అటువంటి తప్పిదం ఆత్మహత్య సదృశ్యం కాబోతుంది. 1972లో తెలంగాణకు ప్రయోజనం కల్గించే ముల్కీ రూల్సు రాజ్యంగ బద్ధమేనని ప్రకటించిన సుప్రీం రాజ్యాంగ ధర్మాసనం ఇచ్చిన తీర్పును పార్లమెంటు చట్టం ద్వారా రద్దుపరచిన చరిత్ర అందరికీ తెలుసు. ఇపుడు సుప్రీం డివిజన్ బెంచ్ ఇచ్చిన తెలంగాణ వ్యతిరేక తీర్పును ఎట్లా ఎదుర్కొంటుందో వేచి చూడాలి.

అక్టోబరు 19న ప్రభుత్వం ఫ్రీజోన్ అంశంపై అఖిలపక్ష సమావేశం ఏర్పాటు చేసింది. సుప్రీంకోర్టులో రివ్యూపిటిషన్ వేస్తామని ప్రతిపాదించింది. టిఆర్ఎస్, లోక్‌సత్తా పార్టీలు మినహా అన్ని పార్టీలు ప్రభుత్వ ప్రతిపాదనని అంగీకరించాయి. సుప్రీంకోర్టు తీర్పు రాష్ట్రపతి ఉత్తర్వులకు అనుగుణంగా ఉందని అందువల్ల రివ్యూ పిటిషన్ అవసరం లేదని లోక్‌సత్తా వాదించి తమ సీమాంధ్ర పక్షపాతాన్ని వెల్లడించింది. టిఆర్ఎస్ మాత్రం రివ్యూ పిటిషన్ వల్ల ఫలితం లేదని రాజ్యాంగ సవరణ ద్వారానే సుప్రీంకోర్టు తీర్పును రద్దు చేయించాలని, అందుకు వీలుగా శాసనసభలో తీర్మానం ఆమోదించి కేంద్రానికి పంపాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది.

అక్టోబరు 21న సిద్ధిపేటలో జరిగిన తెలంగాణ ఉద్యోగులు గర్జనలో తెలంగాణ ఉద్యోగ సంఘాలన్నీ 1972లో ముల్కీరూల్సు రాజ్యాంగ బద్ధమేనని సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును ఏ విధంగా రద్దు చేయించినారో అదే విధంగా ఇప్పటి తీర్పును రద్దు చెయ్యాలని డిమాండ్ చేశాయి. రివ్యూపిటిషన్ వల్ల ఫలితం రాదని ప్రకటించాయి. ఎందుకంటే రివ్యూ పిటిషన్‌ని పరిశీలించేది తీర్పు ఇచ్చిన జడ్జీలే. ఏ జడ్జీ తన తీర్పులో తప్పులున్నాయని ఒప్పుకోడు. కనుక 99% రివ్యూపిటిషన్లు కొట్టివేయబడతాయి. రివ్యూ పిటిషన్‌ని ప్రతివాది అంటే ప్రభుత్వమే వెయ్యాలి. వాదనలు ఉండవు. రాతపూర్వక అఫిడవిట్లు మాత్రమే సమర్పించాలి. సుప్రీంకోర్టుకు సరి అయిన వాదనల్ని, సమాచారాన్ని అందించని ప్రభుత్వం రివ్యూ పిటిషన్ ద్వారా చెప్పే కొత్త విషయం ఏముంటుంది? రివ్యూ పిటిషన్‌ని కొట్టివేస్తే 'క్యూరేటివ్ పిటిషన్' ద్వారా సుప్రీంకోర్టు తలుపులు తట్టవచ్చు. కాని అత్యంత అరుదైన కేసుల్లో మాత్రమే సుప్రీంకోర్టు క్యూరేటివ్ పిటిషన్‌ని అనుమతిస్తుంది. కనుక ఫ్రీజోన్ సమస్యకు న్యాయపరమైన పరిష్కారం కష్టమే. రాష్ట్రపతి ఉత్తర్వుల నుండి ప్యారా 14(ఎఫ్)ని తొలగించేందుకు శాసనపరమైన చర్యలు తీసుకొని సుప్రీంకోర్టు తీర్పు ప్రభావాన్ని రద్దు చెయ్యాలి. ఇటువంటి చర్యలే ఫ్రీజోన్ వివాదాన్ని పరిష్కరిస్తాయని న్యాయకోవిదులు కూడా భావిస్తున్నారు.

 

ఫ్రీజోన్ వివాదంలో న్యాయపరమైన, చట్టపరమైన అంశాలను పక్కనపెట్టి మరొక్క ముఖ్యమైన అంశాన్ని ఈ సందర్భంగా విశ్లేషించుకోవాలి. గాదె వెంకటరెడ్డి. టి.జి. వెంకటేశ్, జె.సి దివాకర్‌రెడ్డి, హరిరామ జోగయ్య తదితరులు హైదరాబాద్‌ని ఫ్రీజోన్‌గా చెయ్యాలని ఎందుకు పట్టుపడుతున్నారు? ఈ రాద్ధాంతం వెనుక ఉన్న లక్ష్యాలేమిటి? ఫ్రీజోన్ భావన వెనుక వారి లక్ష్యాలు స్పష్టంగానే ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఏలాంటి ఆంక్షలు ఉండరాదన్నది వారి ఆకాంక్ష. ఇపుడున్న రాజకీయ పరిస్థితుల్లో ఆంక్షలు లేని ఆంధ్రప్రదేశ్‌ని ఊహించడం దాదాపు అసాధ్యం. కనీసం హైదరాబాద్ నగరమైనా ఆంక్షలు లేని ఫ్రీ జోన్‌గా ఉంటే వారి ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలు నెరవేరుతాయి. రాష్ట్రపతి ఉత్తర్వుల్లో హైదరాబాద్ నగరాన్ని ఆరవజోన్‌లో భాగం చేయడం వల్ల విద్యా, ఉద్యోగావకాశాలు చేజిక్కించుకోవడంలో ఇబ్బందులు ఎదురవుతున్నాయి. హైదరాబాద్ ఆరవ జోన్‌లో భాగమైనప్పటికి ప్యారా 14 కింద మినహాయింపులు పొందిన సచివాలయం, శాఖాధిపతుల కార్యాలయాలు, రాష్ట్రస్థాయి కార్యాలయాలు, సంస్థలు అన్ని హైదరాబాద్‌లోనే ఉండడం చేత వీటిల్లో 90% ఉద్యోగాలను తెలంగాణేతరులే చేజిక్కించుకోగలిగారు. ఇపుడు ఆ చిన్న అడ్డంకి కూడా తొలగిపోతే బాగుండునని వారి ఆశ. అమెరికా సామ్రాజ్యవాదం ప్రపంచమంతా ఆంక్షలు లేని ఫ్రీ మార్కెట్‌గా మారాలని కోరుతున్నట్లుగా సీమాంధ్రనేతలు ఆంక్షలు లేని హైదరాబాద్‌ని కోరుతున్నారు. గిర్‌గ్లానీ సిఫారుసులు, 610 జీవో అమలయితే సీమాంధ్ర ఉద్యోగులు హైదరాబాద్ వదలి వెళ్లవలసి ఉంటుందని వారికి తెలుసు. హైదరాబాద్‌లోని ఉద్యోగాలని, విద్యావకాశాలని, వ్యాపారాలని, వనరులని తమ ఆధీనంలోకి తెచ్చుకున్న సీమాంధ్ర సంపన్నవర్గాలకు నగరంపై తమ ఆధిపత్యాన్ని వదులకోవడం కష్టంగానే ఉంటుంది. అందుకనే ఎపుడు వీలయితే అపుడు ఫ్రీజోన్ వివాదాన్ని ముందుకు తెస్తారు. రేపు తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు అయితే కూడా హైదరాబాద్ నగరం తెలంగాణకు దక్కకుండా చేయడానికి హైదరాబాద్ నగరాన్ని కేంద్రపాలిత ప్రాంతంగా చెయ్యాలనే డిమాండ్‌ని ముందుకు తెస్తారు. హైదరాబాద్ నగరాన్ని ఒక వివాదాస్పద ప్రాంతంగా మార్చే ప్రయత్నం చేస్తారు. సమైక్యరాష్ట్రంలో హైదరాబాద్ ఫ్రీజోన్‌గా ఉండాలి. తెలంగాణ రాష్ట్రమే ఏర్పాటైతే హైదరాబాద్ నగరం తెలంగాణకు దక్కకుండా చెయ్యాలి. సీమాంధ్రనేతల ఈ కుట్రాజకీయాన్ని తెలంగాణ ప్రజలు అర్థం చేసుకున్నారు. అందుకు ఫ్రీ జోన్ భావనను, కేంద్రపాలిత ప్రాంతం ప్రతిపాదనని తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు. ఫ్రీజోన్ వివాదంలో తెలంగాణ ఉద్యమం నైతిక విజయం సాధించింది. అయితే గిర్‌గ్లానీ సిఫారసులను, 610 జీవోను సంపూర్ణంగా అమలు చేయించుకోవడంలో తెలంగాణ ఉద్యోగులు, నిరుద్యోగులు, ప్రజలు ప్రభుత్వంపై ఒత్తిడిని మరింత పెంచాల్సిన అవసరం ఉన్నది. ఈ ఒత్తిడి అంతిమంగా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు దోహదం చెయ్యాలి. ఎందుకంటే ఈ సమస్యలన్నీ తెలంగాణ రాష్ట్రంలోనే పరిష్కారమవుతాయి.

***(17 అక్టోబరు, 2009న ఆంధ్రజ్యోతిలో అచ్చయిన వ్యాసం పూర్తి పాఠం)***



# ఫ్రీజోన్ సమస్యకు పార్లమెంటు చట్టమే పరిష్కారం

**- ఆర్. చంద్రశేఖరరెడ్డి**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వ్యవహారాలలోని ఒక సున్నిత అంశంపై దేశ సర్వోన్నత న్యాయస్థానం మరో మారు వివాదాస్పదమైన తీర్పును వెలువరించింది. సుప్రీంకోర్టు ఈ నెల 9న 'హైదరాబాద్ ఫ్రీ జోన్' అని తీర్పు ఇవ్వడం తెలంగాణ ప్రజలను ముఖ్యంగా ఉద్యోగులు, నిరుద్యోగులను దిగ్భ్రాంతి పరచింది. ప్రభుత్వోద్యోగాలలో తమకు దక్కవలసిన వాటా దక్కక జీవో 610 అమలు కాక సతమతమవుతుంటే తాజాగా 'ఫ్రీ జోన్' వివాదం వచ్చిపడింది. తెలంగాణ యువజనులలో సహజంగానే ఒక అలజడి మొదలయింది.

సుప్రీంకోర్టు తీర్పు వివరాలలోకి వెళదాం. రాష్ట్రపతి ఉత్తర్వుల్లోని పేరా 14 (ఎఫ్) ని అనుసరించి 'హైదరాబాద్ పోలీస్ చట్టం' ప్రకారం జరిగిన నియామకాలకు మినహాయింపు వర్తిస్తుందని సుప్రీంకోర్టు భావించినట్టుగా కన్పిస్తోంది. ఈ కారణంగానే 'హైదరాబాద్ ఫ్రీ జోన్' అని తీర్పు ఇచ్చినట్లుగా ఉంది. ఈ తీర్పు పోలీస్ శాఖకు మాత్రమే వర్తించేది అయినప్పటికీ దాని ఆధారంగా భవిష్యత్తులో మిగతా ప్రభుత్వ శాఖలకు కూడా 'ఫ్రీ జోన్' సూత్రాన్ని వర్తింపజేసే ప్రమాదమెంతైనా ఉన్నది. నిజానికి రాష్ట్రపతి ఉత్తర్వులలో ఎక్కడా 'ఫ్రీ జోన్' అనే పదాన్ని ప్రస్తావించలేదు. ఆ ఉత్తర్వు (జీవో ఎం.ఎస్.674)ను 32వ రాజ్యాంగ సరవణ ప్రకారం భారత రాష్ట్రపతి 1975 అక్టోబర్ 18న జారీ చేశారు. దీనినే 'ప్రెసిడెన్షియల్ ఆర్డర్' అని కూడా అంటారు. ఈ ఉత్తర్వుల మేరకు రాష్ట్ర ప్రభుత్వోద్యోగాలకు సంబంధించి ఆంధ్రప్రదేశ్‌ను 6 జోన్‌లుగా విభజించారు. 1,2,3,జోన్లు కోస్తాంధ్ర ప్రాంతంగా, 4 వ జోన్ రాయలసీమ ప్రాంతంగా, 5,6 జోన్లు తెలంగాణ ప్రాంతంగా విభజించారు. హైదరాబాద్, నల్లగొండ, మెదక్, నిజామాబాద్, రంగారెడ్డి జిల్లాలను 6వ జోన్‌గా పరిగణించారు. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఒక తీర్పులో 'జీవో ఎం.ఎస్.674లోని 11వ పేరాలో పేర్కొన్నట్టు రాష్ట్రపతి ఉత్తర్వులకు ముందున్న చట్టాలు,నిబంధనలు ఏవీ చెల్లవని,రాష్ట్రపతి ఉత్తర్వులు మాత్రమే అమలవుతాయని' స్పష్టం చేసింది. అయితే నియామకాల సమయంలో మినహాయింపులు ఉన్నాయి కాని రాష్ట్ర రాజధాని ఫ్రీ జోన్ అని కానీ లేదా 7వ జోన్ అని కానీ ఆరు సూత్రాల ప్రకారం వచ్చిన రాష్ట్రపతి ఉత్తర్వుల్లో లేనే లేదు.

మన రాష్ట్ర ప్రభుత్వం సరైన వాదనలు విన్పించక పోవడం వల్లే సుప్రీంకోర్టు తీర్పు వ్యతిరేకంగా వచ్చిందని రాజకీయ విశ్లేషకులు, తెలంగాణ ప్రజలు అభిప్రాయపడుతున్నారు. రాష్ట్ర ప్రభుత్వ వాదనలను విన్పించడానికి ఉత్తరప్రదేశ్‌కు చెందిన సక్సేనా అనే న్యాయవాదిని అడ్వకేట్ ఆన్ రికార్డ్‌గా 2004లో నియమించారు. అతనికి మన రాష్ట్ర చట్టాల గురించి సరైన అవగాహన లేదు. పైగా అతను నియమించిన సీనియర్ న్యాయవాది అనూప్ జి. చౌదరి మధ్యప్రదేశ్‌కు చెందిన వాడు. ఇలాంటి వివాదాస్పద కేసులలో రాష్ట్రానికి చెందిన ప్రభుత్వ న్యాయవాది భారతీరెడ్డిని నియమించకపోవడం పెద్ద పొరపాటు. సుప్రీం కోర్టులో రాష్ట్ర ప్రభుత్వం తరపున వాదిస్తున్న న్యాయవాదులకు సహాయపడడానికీ సీనియర్ ఐఏఎస్/ ఐపిఎస్ అధికారులు ఎవరినైనా పంపించారా అంటే అదీ లేదు. జలయజ్ఞం ప్రాజెక్టుల వివాదాలకు సంబంధించి డోలేంద్రప్రసాద్ దాఖలు చేసిన కేసులలోను, రామోజీరావు మార్గదర్శి వ్యవహారాలకు సంబంధించిన కేసులలోను రాంజెఠ్మలానీ, జి. వాహనపతి వంటి న్యాయవాద ప్రకాండులను నియమించిన ప్రభుత్వం, ప్రభుత్వోద్యోగాలకు సంబంధించిన కేసులో సరైన సీనియర్ న్యాయవాదిని ఉద్దేశ పూర్వకంగానే నియమించలేదని పలువురు అంటున్నారు. వాదనలు పటిష్టంగా విన్పించకుండా కేవలం కౌంటర్ అఫిడవిట్‌లపై ఆధారపడడం వల్లే కేసు నీరుగారిపోయిందనే అభిప్రాయం వ్యక్తమవుతుంది.

సుప్రీంకోర్టు తీర్పు తెలంగాణవాదులను సహజంగానే ఆగ్రహావేశాలకు లోను చేసింది. న్యాయపోరాటం చేస్తామని కొందరు అంటే ప్రజల్లోకి వెళ్లి ఉద్యమాలు ప్రారంభిస్తామని పలువురు ప్రకటించారు. అయితే ఇటువంటి కేసుల్లో ప్రజా ప్రయోజన వ్యాజ్యాన్ని సర్వోన్నత న్యాయస్థానంలో వేయడానికి వీలులేదనే సత్యాన్ని గుర్తించాలి.

ఎందుకంటే ఒకసారి ఒక కేసులో సుప్రీంకోర్టు ఏదైతే తీర్పు ఇస్తుందో అదే అంశంపై అధికరణ 32 ప్రకారం రిట్ పిటీషన్ నిలబడదు (not maintianable). ఇక మిలిగింది. రివ్యూ పిటీషన్. ఆ రివ్యూ పిటీషన్ కూడా ప్రభుత్వం, అందులో ఉన్న ప్రతివాదులే వేయాలి. ఇతరులు వేయరాదని సత్వర్ సింగ్ వెర్సెస్ బల్దేవా (ఎఐఆర్1997 ఎస్‌సి 169) కేసులో సుప్రీంకోర్టు స్పష్టం చేసింది.

ఏమైనా మన రాష్ట్ర ప్రభుత్వానికి నిజంగా ఈ అంశంపై చిత్తశుద్ధి ఉంటే 30 రోజులలో రివ్యూ పిటీషన్ దాకలు చేయాలి. ఆ రివ్యూపిటీషన్‌ను దాఖలు చేసేముందు న్యాయకోవిదులను సంప్రదించి వారి అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకున్న తర్వాతనే ముందుకు సాగాలి. సాధారణంగా సుప్రీంకోర్టులో 95 శాతం రిట్ పిటిషన్‌లు కొట్టి వేయబడతాయి. ఎందుకంటే ముందు అప్పీల్‌లో తుది వాదనలకు వచ్చినప్పుడు ఇరువర్గాల వాదనలకు పూర్తిగా సమయం కేటాయించి నిశితంగా పరిశీలించిన పిమ్మట తీర్పు వెలువరిస్తారు. కాబట్టి ఆ రివ్యూ పిటీషన్లలోని అంశాలను పునఃపరిశీలన చేయడం వల్ల లాభం ఉందని సర్వోన్నత న్యాయూర్తులు భావిస్తారు. ఈ విషయాన్ని దృష్టిలో



ఉంచుకొని ఇదే రివ్యూ పిటీషన్‌లో ఒక ఐ.ఎ.వేసి కోర్టులో వాదనకు అవకాశం ఇవ్వాలని కోరాలి. ఎందుకంటే సుప్రీం కోర్టులో రివ్యూ పిటీషన్ విచారణలో వాదనలు ఉండవు. చాంబర్‌లోనే ఆ పిటీషన్‌ను పరిశీలించి న్యాయమూర్తి తన నిర్ణయాన్ని ప్రకటిస్తారు.

ఒకవేల రివ్యూ పిటీషన్ కొట్టివేబయడితే ఆ తర్వాత మిగిలే చివరి అవకాశమే క్యురేటివ్ పిటీషన్. ఇది ఎంతో అరుదైన కేసుల్లో మాత్రమే వేయాలి. 2002లో ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ఎస్.పి.బరుచా ఆధ్వర్యంలో ఐదుగురు న్యాయమూర్తుల ధర్మాసనం, సుప్రీంకోర్టు చరిత్రలోనే అలాంటి అవకాశాన్ని ప్రప్రథమంగా కల్పించింది. రూపా అకోశ్ హుర్ర వెర్సెన్ అశోక్ హుర్ర (2004 (4) ఎస్‌సిసి 388) కేసులో ఈ అరుదైన అవకాశం ఇచ్చారు.

క్యురేటివ్ పిటీషన్ ప్రకారం సుప్రీంకోర్టు సీనియర్ న్యాయవాది ఒక లేఖ ఇవ్వాలి. అప్పీల్, రివ్యూలలో ఏయే అంశాలను పరిగణనలోకి తీసుకుని ఈ కేసును పునః పరిశీలించాలో ఆ లేఖలో స్పష్టంగా పేర్కొనాలి. ఈ లేఖ కూడా ఐదుగురు న్యాయమూర్తుల ధర్మాసనం ముందుకు వెళ్తుంది. క్యురేటివ్ పిటిషన్ పై విచారణలోనైన ప్రభుత్వం తన వాదనలను సరిగ్గా విన్పించాలి. క్యురేటివ్ పిటీషన్ వేయని పక్షంలో ప్రభుత్వం ఏమి చేయాలి? తెలంగాణ వారికి అన్యాయం జరగకూడదని రాష్ట్ర ప్రభుత్వం చిత్తశుద్ధితో భావిస్తుంటే ఫ్రీ జోన్ తీర్పుకు వ్యతిరేకంగా పార్లమెంటులో ఒక చట్టం తేవాలని (అసెంబ్లీ తీర్మానం ద్వారా) కేంద్ర ప్రభుత్వంపై ఒత్తిడిచేయాలి. గతంలో అంటే 1972లో ముల్కీ నిబంధనలను సుప్రీంకోర్టు సమర్ధిస్తే ఎలా అయితే పార్లమెంటులో చట్టం తీసుకురావడం ద్వారా ఆ తీర్పును రద్దు చేయించారో అలాగే ఇప్పుడు కూడా మన రాష్ట్ర ప్రభుత్వంపై ఫ్రీ జోన్ వివాదాన్ని నివారించవచ్చు. ఆంధ్రప్రదేశ్ ఆవిర్భవించినది మొదలు ఒక దశాబ్దకాలానికి పైగా తెలంగాణ ప్రజలు ముఖ్యంగా విద్యార్థులు, ఉద్యోగులు అనేక కష్టనష్టాలకు గురికావడం వల్లే ప్రత్యేక తెలంగాణ ఆకాంక్ష ఉద్యమరూపు తీసుకొంది. 1968 సంత్సరాంతంలో ఒక అపూర్వ ఉద్యమానికి నాందీ గీతం పాడారు. ఏ రాజకీయపక్షంతో సంబంధ లేకుండానే ప్రజా ఉద్యమానికి జీవం పోశారు. ఆ ఉద్యమం 1969 నాటికి తీవ్రరూపం దాల్చింది. దీంతో ప్రభుత్వం మేలుకొంది . అన్ని పార్టీల నాయకులతో సమష్టిగా చర్చలు జరిపింది. దాని ఫలితమే 1969 జనవరి 19న కుదిరిన అఖిల పక్ష ఒప్పందం.

ఈ అఖిలపక్ష ఒప్పందాన్ని అముల పరిచేందుకు ఆనాటి ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి అదే ఏడాది జనవరి 21నే జీవో జారీ చేశారు. అదే జీవో 36. ఈ ఉత్తర్వు ప్రకారం తెలంగాణలో అక్రమంగా ఉద్యోగాలు చేస్తున్న స్థానికేతరులను 1969 ఫిబ్రవరి 28 నాటికి వారి సొంత ప్రాంతాలకు పంపించి వేయాలి. దీనిపై ఆంధ్ర ఉద్యోగులు హై కోర్టులో రిట్ పిటిషన్ (నెంబర్ 221/1969) వేయగా జీవో 36 చెల్లదని తీర్పు వచ్చింది.

ఆ తరువాత మరికొంత మంది ఆంధ్ర ఉద్యోగులు అసలు ముల్కీ నిబంధనలే చట్టబద్ధం కావని రాష్ట్ర హైకోర్టులో సవాల్ చేశారు. దీనిపై ఐదుగురు న్యాయమూర్తులతో కూడిన ధర్మాసనం 1971 డిసెంబర్ 18న 'ముల్కీ నిబంధనలు చెల్లవని' తీర్పు ఇచ్చింది. ఈ తీర్పును తెలంగాణ వాదులు సుప్రీంకోర్టులో సవాలు చేశారు. 'తెలంగాణలో అమలులో ఉన్న ముల్కీ నిబంధనలు రాజ్యాంగ బద్ధమేనని' 1972 అక్టోబర్ 16న సర్వోన్నత న్యాయస్థానం సంచలనాత్మక తీర్పు వెలువరించింది.

ఈ తీర్పును వ్యతిరేకిస్తూ ఆంధ్ర ప్రాంతీయులు 'జై ఆంధ్ర' ఉద్యమాన్ని ప్రారంభించారు. తెలంగాణ ప్రాంతానికి ఇచ్చిన అన్ని హామీలతోపాటు ముల్కీ నిబంధనలు, ప్రాంతీయ కమిటీని రద్దు చేయాలని పట్టుబట్టారు. ఎటువంటి షరతులు, హామీలు, ఒప్పందాలు లేని ఆంధ్రప్రదేశ్ కావాలని, లేదంటే తమకు ప్రత్యేక రాష్ట్రం ఇవ్వాలని డిమాండ్ చేశారు. ఆంధ్రప్రదేశ్‌ను రెండు రాష్ట్రాలుగా విభజించాలని కోరుతూ ఉద్యమాన్ని ప్రారంభించారు. అది తీవ్రమవడంతో 1973 జనవరి 18న ముఖ్యమంత్రి పదవికి పి.వి. నరసింహారావు రాజీనామా చేశారు. ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పాటు చేసే పరిస్థితులు లేనందున రాష్ట్రంలో కేంద్ర పాలనలను విధించారు. ప్రధాని ఇందిరాగాంధీ చొరవ తీసుకొని ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలవారి ప్రయోజనాలను సమంగా కాపాడేందుకు ఆరు సూత్రాల పతకం నొకదాన్ని ప్రతిపాదించారు. 1973 సెప్టెంబర్ 23న ఆ పథకాన్ని ఆమోదించారు. ఆక్షణమే ఆ ఆరు సూత్రాల పతకం తెలంగాణ నిరుద్యోగుల పాలిట ఉరిత్రాడుగా మారింది. ఆ తరువాత ఆరు సూత్రాల పథకంలోని ప్రెసిడెన్షియల్ ఆర్డర్ ప్రకారం ప్రస్తుతం జోన్‌ల వ్యవస్థ ఏర్పాటు చేశారు. ఇప్పుడు మళ్లీ ఈ ఫ్రీ జోన్ వివాదంతో ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాల మధ్య విద్వేషాలు రగుల్కొంటున్నాయి. ప్రత్యేక రాష్ట్ర వాదనలు మొదలయ్యాయి. నాడు ఆంధ్ర ప్రాంతం వారు 'జై ఆంధ్ర' ఉద్యమం ప్రారంభించి ముల్కీ నిబంధనలను ఎలాగైతే రద్దు చేయించగలిగారో అదే విధంగా నేడు తెంగాణ వాదులు ఉద్యమించి సుప్రీం కోర్టు తీర్పును పార్లమెంటు చట్టం ద్వారా రద్దు చేయిస్తారా అనేది వేచి చూడాల్సిందే.

*(వ్యాసకర్త సుప్రీంకోర్టు న్యాయవాది)*

***(27 అక్టోబరు 2009, ఆంధ్రజ్యోతి)***



# నిజాం కాలం నుంచి నేటి వరకు నాన్ లోకల్‌గానే హైదరాబాదీలు

# యువత పాలిట పెనుశాపం ఫ్రీజోన్

**- డి. మురళీధర్ అమర్‌నాథ్**

రాష్ట్ర రాజధాని నగరం హైదరాబాద్ ఫ్రీ జోన్‌గా ఉండడం ఇక్కడి యువత పాలిట పెనుశాపంగా మారింది. నిజాం కాలం నుంచి నేటివరకు ఇదే పరిస్థితి కొనసాగుతున్నా దీనిని సరిదిద్దేందుకు ఇప్పటి వరకు సరైనయత్నం జరగలేదని తెలంగాణ మేధావులు విమర్శిస్తున్నారు. ఫ్రీ జోన్ రాజకీయనాయకులు అధికారుల వాదనలు ఎలావున్నా దీనివల్ల ఇప్పటికే ఇక్కడి యువత న్యాయంగా పొందాల్సిన వేలాది ఉద్యోగాలను కోల్పోగా భవిష్యత్తులోనూ ఇది కొనసాగే వీలుంటడంతో మరిన్ని వేల నౌకరీలు అన్యాక్రాంతం కానున్నాయి. పోలీసు శాఖలోని నిబంధనల ప్రకారం రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలో నాన్‌లోకల్‌గా వున్న హైదరాబాదీలు ఫ్రీజోన్ పుణ్యమాని నగరంలోనూ స్థానికేతరులుగా మారడాన్ని పాలకులు, నేతలు వెంటనే గ్రహించి, దానిని సరిదిద్దాల్సిన అవసరం వుంది. హైదరాబాద్ ప్రాంతాన్ని ఫ్రీజోన్‌గా పేర్కొంటూ సుప్రీంకోర్టు తాజాగా ఇచ్చిన తీర్పు పోలీసుశాఖలో ప్రకంపనలు సృష్టిస్తున్నాయి. పోలీసు శాఖలో హైదరాబాద్ ప్రాంతం మొదటినుంచి వివాదాలమయంగానే వుంది. హైరదాబాద్ ప్రాంతం ఆంధ్రప్రదేశ్‌లో విలీనం కాక ముందు అంటే నిజాంపాలకుల హయాంలో కూడా ఇక్కడి పోలీసు భర్తీలో స్థానికేతరులదే పెద్దపీటగా వుంటూ వచ్చిందని రికార్డులు చెబుతున్నాయి. అయితే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటయ్యాక కూడా ఇదే అనవాయితీగా రాసాగింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పాటుపై రాష్ట్రపతి ఉత్తర్వులు వెలువడ్డాక 1976 నుంచి ఫ్రీ జోన్‌పై అధికారిక నిర్ణయం వెలువడింది. ఇలా 1976 నుంచి హైదరాబాద్ ఫ్రీ జోన్‌గా వుండడం వల్ల న్యాయంగా ఇక్కడి యువతకు రావాల్సిన ఉద్యోగాలను ఇతర ప్రాంతాలకు చెందిన వారి సొంతమవుతున్నాయని మేధావులు వ్యాఖ్యానిస్తున్నారు. రాష్ట్రంలోని ఏ ప్రాంతానికి చెందిన వారైనా హైదరాబాద్‌లో లోకల్ అభ్యర్థులుగా ఉద్యోగాల్లో చేరే అవకాశం కల్పించడమే ఫ్రీ జోన్ ముఖ్య ఉద్దేశం. కానిస్టేబుల్ నుంచి ఎస్ఐల భర్తీ వరకు రాష్ట్రవ్యాప్తంగా అన్నిజిల్లాల వారు హైదరాబాద్ పోలీసు విభాగంలో

చేరుతుండడంవల్ల నగరవాసులకు అవకాశం లేకుండా పోతోందని చాలాకాలంగా విమర్శలున్నాయి. ఈ కారణంగానే సిటీ పోలీసు విభాగంలోని మొత్తం సిబ్బందిలో 30 శాతానికి పైగా ఇతర ప్రాంతాలకు చెందిన వారున్నారని మేధావులు అంటున్నారు. సిటీ పోలీసు విభాగంలో మొత్తం మీద పది వేల మంది వరకు సిబ్బంది ఉండగా ఇందులో రికార్డు ప్రకారం మూడువేల మందికి పైగా స్థానికేతరులు వున్నారు. పోలీసుశాఖ భర్తీలో సర్కారు రూపొందించిన నియమాల ప్రకారం రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాలో 80 శాతం పోస్టులు స్థానికులకు 20 శాతం పోస్టులు స్థానికేతరులకు కేటాయించారు. రాష్ట్రం ఏర్పాటయినప్పటి నుంచి హైదరాబాద్ మినహా అన్ని ప్రాంతాలలో ఈ నిబంధన అమల్లో ఉంది. ఈ నిబంధన ప్రకారం కానిస్టేబుల్ పోస్టుల భర్తీకి జిల్లాను ఓ యూనిట్‌గా, ఎస్ఐ పోస్టులను మూడునుంచి ఐదు జిల్లాలకు కలిపి వుండే రేంజిని ఒక యూనిట్‌గా పరిగణిస్తున్నారు. అంటే కానిస్టేబుల్ పోస్టులకు పోటీపడే అభ్యర్థులు వారి సొంత జిల్లాలలో లోకల్ అభ్యర్థులుగా 80 శాతం కోటాను పొందే వీలుంది. మిగతా 20 శాతం పోస్టులకు ఇతరప్రాంతాల వారికి కేటాయిస్తారు. ఇదే ఎస్ఐ పోస్టులకు వచ్చే సరికి రేంజిలోని జిల్లాల వారు లోకల్ అభ్యర్థులుగానూ, ఇతర ప్రాంతావారు నాన్ లోకల్‌గాను ఉంటారు. అయితే హైదరాబాద్ ఫ్రీజోన్ అవడంవల్ల సిటీ పోలీసు విభాగంలోని ఏ పోస్టుకయినా రాష్ట్రవ్యాప్తంగా అందరు పోటీపడే అవకాశం ఏర్పడింది. ఇది ఒకరకంగా హైదరాబాదీలకు అన్యాయమని తెలంగాణ మేధావులు అంటున్నారు. రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల్లో ఏర్పడే పోలీసు ఖాళీలలో 20 శాతం నాన్‌లోకల్ కోటాలోనే అతికష్టంమీద భర్తీ అవుతున్న నగర యువకులు హైదరాబాద్ వరకు ఇచ్చేసరికి కూడా నాన్ లోకల్‌గా పోటీ పడాల్సి రావడం అన్యాయమని వారు అభిప్రాయపడుతున్నారు.

## ఫ్రీ జోన్‌లో పోటీ పడలేక పోతున్న హైదరాబాదీలు

ఇదిలావుండగా హైదరాబాద్ ఫ్రీ జోన్‌గా మారడం వల్ల రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలు ముఖ్యంగా నల్లగొండ, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలకు చెందిన విద్యావంతులతో హైదరాబాద్ యువత పోటీపడలేకపోతున్న విషయాన్ని ఉన్నతాధికారులు రెండు దశాబ్దాల క్రితమే గుర్తించారు. ఈ జిల్లాలకు చెందిన అనేక మంది డిగ్రీ, పిజిలు, యువకుల్లో అత్యధికం ఇంటర్‌మీడియట్ చదివిన వారే ఉండడంతో వారితో పోటీపడలేక పోతున్నవైనాన్ని ఉన్నతాధికారులు గుర్తించారు. దేహదారుఢ్యం, ఇతరత్రా అంశాలలో రాతపరీక్షవరకు వచ్చేసరికి ఉన్నత చదువులు చదివిన ఇతరప్రాంతాల వారితో పోటీపడలేక పోతుండడవల్ల మెజారిటీ పోస్టులు కోల్పోతున్నారని పేరు తెలిపేందుకు ఇష్టపడని ఓ సీనియర్ ఐపిఎస్ అధికారి ప్రభాతవార్తకు తెలిపారు. ఈ కారణంగానే హైదరాబాద్ పోలీసు శాఖలోని అన్ని పోస్టుల్లో గడచిన మూడున్నర దశాబ్దాలుగా స్థానికేతరులే పాగా వేయసాగారని పేర్కొన్నారు. హైదరాబాద్ కూడా ఇతర ప్రాంతాల మాదిరిగానే వుండి వుంటే ఈ ఉద్యోగాలన్నీ ఇక్కడి యువతకు లభించే వీలుండేదని ఆయన అభిప్రాయడ్డారు. ఇదే అంశాన్ని తెలంగాణా మేధావులు సైతం అంగీకరిస్తున్నారు.



హైదరాబాద్ ఫ్రీజోన్‌గా మారడం వల్ల ఎక్కువగా నష్టపోయింది పాతబస్తీ వాసులేనని తెలంగాణ మేధావులు అభిప్రాయపడుతున్నారు. ఉన్నత విద్య చదివిన ఇతర ప్రాంతాల వారితో పాతబస్తీ యువకులు పోటీపడటం కష్టంగా మారడం వల్ల వారికి పోలీసు శాఖలో ఉద్యోగాలు పెద్దగా లభించడం లేదని వారంటున్నారు. సిటీ పోలీసు విభాగంలో పాతబస్తీవాసుల సంఖ్యపెద్దగా లేకపోవడం దీనివల్లేనని వారంటున్నారు. పాతబస్తీ యువకులను పోలీసు విభాగంలో చేర్పించడానికి పోలీసు అధికారులు ముందస్తు పథకాలు చేబడుతున్నా విద్యాపరంగా ఉన్నతస్థాయిలో వున్న ఇతర ప్రాంతాల వారితో ఇక్కడి యువత రాత పరీక్షల్లో పోటీపడీ లేక పోతున్నారని, ఈ కారణంగానే మెజారిటీ ఉద్యోగాలను హైదరాబాదీలు కోల్పోతున్నారని మేధావులు వారంటున్నారు.

## ప్రజా సంఘాల ఆందోళనతో ఫ్రీజోన్ రద్దయ్యేనా?

హైదరాబాద్ ప్రాంతం ఫ్రీ జోన్‌గా వుండడం వల్ల జరిగిన నష్టాలపై పలు ప్రజా సంఘాలతోపాటు రాజకీయపార్టీలు చేసిన ఆందోళన కారణంగా సర్కారులో కొంత చలనం కలిగింది. అంతకు ముందు 1985 డిసెంబర్ 30వ తేదీన తెలంగాణ ప్రాంత ఉద్యోగులకు మేలు చేకూర్చేందుకు ఉద్దేశించిన 610 జిఓను అప్పటి ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు అమలుచేయాలని నిర్ణయించారు. అయితే 610 జిఓ మాత్రం చాలాకాలం వరకు అమలుకాలేదు. దీనిపై ప్రజా సంఘాలతో పాటు రాజకీయ పార్టీలు ఆందోళన చేయడంతో 2002లో చంద్రబాబు నాయుడు సర్కారు దిగి వచ్చింది. ఇదే సమయంలో 2002 ఫ్రీ జోన్‌ను హైకోర్టు రద్దు చేసింది. దీంతో పాటు ఫ్రీజోన్‌ను అంతకు ముందే వున్న హైదరాబాద్ జోన్‌లో కలిపి వేసింది. పోలీసుశాఖలో పాటు అన్ని శాఖల్లోనూ ఫ్రీ జోన్ ప్రభావం వున్నా పోలీసు విభాగంపైనే ఎక్కువగా వుండడం చెప్పుకోదగ్గ అంశం.కాగా హైకోర్టు నిర్ణయాన్ని హైదరాబాద్ సిటీ పోలీసుల్లో ఒక వర్గం తీవ్రంగా వ్యతిరేకిస్తూ సుప్రీంకోర్టును ఆశ్రయించింది. దీనిపై ఏడేళ్లుగా వ్యాజ్యాలు కొనసాగగా చివరకు సుప్రీంకోర్టు హైకోర్టు తీర్పును కొట్టివేయడంతో ఫ్రీ జోన్‌పై మరోసారి రాజకీయపార్టీలు ఉద్యమానికి సిద్ధమయ్యాయి. తీర్పుతో తెరపడినా ఈ తీర్పులో కొత్త అంశాలు తెరపైకి వచ్చాయి. ఇక ఫ్రీ జోన్ రద్దయిన సమయంలో 610 జి ఓ. ప్రకారం సిటీ పోలీసు భాగం నుంచి మూడు వేల 2500 మంది మంది స్థానికేతరులను వారి వారి సొంత జిల్లాలను పంపాలని అప్పటి పోలీసు కమిషనర్ ఎ.కె. మొహంతి నిర్ణయించారు. ఇందులో వెయ్యిమంది వరకు సిబ్బంది సొంత ప్రాంతాలకు వెళ్లిపోగా మిగతా వారు కోర్టులను ఆశ్రయించి ఇక్కడే విధుల్లో వున్నారు.

## సుప్రీంకోర్టు తీర్పు పై సర్కారు అప్పీలు ఫలించేనా?

హైదరాబాద్ ప్రాంతాన్ని ఫ్రీ జోన్‌గా సుప్రీంకోర్టు పేర్కొనడంపై తెలంగాణ ప్రాంతంలో వెల్లువెత్తుతున్న నిరసనలను దృష్టిలో వుంచుకుని దీనిపై అప్పీలు చేయాలని సర్కారు నిర్ణయించడంపై భిన్నవాదనలు వినిపిస్తున్నాయి. ఈ అంశానికి నీరు గార్చేందుకే

సర్కారు ఇలా చేసిందని టిఆర్ఎస్ అంటుండగా ఇతర పార్టీలు ప్రభుత్వానికే బాసటగా నిలిచాయి. అయితే ఈ అప్పీలు వల్ల ఫ్రీ జోన్ వివాదం మరికొన్నేళ్లు సాగతీతకు గురయ్యే వీలుందని తెలంగాణ మేధావులు అంటున్నారు. దీనివల్ల ఈ అంశం హింసాత్మకంగా రూపుదాల్చే వీలుందని కూడా వారు అభిప్రాయపడుతున్నారు. ఫ్రీ జోన్ అంశంపై సర్కారు వెంటనే ఓ నిర్ణయం తీసుకుని సుప్రీంకోర్టులో గట్టిగా వాదించడంతో పాటు కేంద్రంపై ఒత్తిడి తెచ్చి దీనిని రద్దు చేయించాలని వారు కోరుతున్నారు.

### నిలిచిపోయిన భర్తీలు

హైదరాబాద్ ప్రాంతాన్ని ఫ్రీ జోన్‌గానే సుప్రీంకోర్టు పేర్కొనడంతో గతంలో ఇదే అంశంపై హైకోర్టు ఇచ్చిన ఆదేశాలతో పదోన్నతులు పొందిన పోలీసుల భవితవ్యం ప్రమాదంలో పడింది. ఫ్రీ జోన్ అనేది లేదని, హైదరాబాద్ ప్రాంతంలోనూ 610 జిఓ వర్తిస్తుందని లోగడ హైకోర్టు పేర్కొనడంతో సిటీ పోలీసు విభాగాన్ని హైదరాబాద్ రేంజితో విలీనం చేసిన సర్కారు పదోన్నతుల విషయంలో ప్రత్యేక విధానాన్ని ఎంచుకుంది. ఈ విధానం వల్ల అవిభక్త హైదరాబాద్ రేంజిలోని రంగారెడ్డి, నల్లగొండ, మహబూబ్‌నగర్, మెదక్, నిజామాబాద్ జిల్లాలతోపాటు, సైబరాబాద్ కమిషరేట్ పరిధిలో వున్న సీనియారిటీలిస్టును, హైదరాబాద్‌సిటీ పోలీసు విభాగం సీనియారిటీ లిస్టుతో కలిపివేసి కొత్త సీనియారిటీని తయారుచేసింది. దీనివల్ల హైదరాబాద్ రేంజిలోని అధికారులకు అన్యాయం జరగగా సిటీ పోలీసు విభాగం అధికారులు బాగా లబ్ది పొందారు. అయితే ఇప్పుడు సుప్రీంకోర్టు తీర్పుతో వీరి పదోన్నతులను రద్దు చేయాలని అప్పట్లో నష్టపోయిన అధికారులు కోరుతున్నారు. దనిపై వారు సుప్రీంకోర్టులో కేసు వేయాలని కూడా నిర్ణయించుకున్నారు. ఇదే జరిగితే అప్పట్లో పదోన్నతులు పొందిన వారి భవితవ్యం ప్రమాదంలో పడే వీలుంది. కాగా ఫ్రీ జోన్‌పై సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పుతో రాష్ట్రంలో పోలీసుశాఖకు సంబంధించిన అన్ని భర్తీలు నిలిచి పోయాయి. ఇటీవల కానిస్టేబుల్, ఎస్ఐ పోస్టులకు సంబంధించి వెలువడ్డ నోటిఫికేషన్‌పై మరో వారం రోజుల్లో 5 కె రన్ జరగాల్సి వుంది. అయితే సర్కారు దీనిని ఉన్నపళంగా రద్దు చేసింది. ఇదే సమయంలో కానిస్టేబుళ్లు, ఎస్ఐ పోస్టుల కోసం ఎంపికైన అభ్యర్థుల చేరికను కూడా వాయిదా వేసింది. రాష్ట్ర వ్యాప్తంగా పదివేల మంది వరకు కానిస్టేబుళ్లను, రెండు వేల మంది వరకు ఎస్ఐలను సర్కారు ఇటీవలే భర్తీ చేసింది. ఇందులో కానిస్టేబుళ్ల ఎంపికకు సంబంధించిన ఫలితాలు వెలువడాల్సి వుంది. దీంతో పాటు ఎస్ఐ పోస్టులకు ఎంపికైన వారు రాతపరీక్షల్లో ఉత్తీర్ణులై నవంబర్ మొదటి వారంలో శిక్షణకు వెళ్లాల్సి ఉంది. అయితే ఫ్రీ జోన్ వివాదం కారణంగా కానిస్టేబుల్ పోస్టులకు సంబంధించిన రాత పరీక్షల ఫలితాలను, ఎస్ఐలుగా ఎంపికైన వారిక చేరికను సర్కారు వాయిదా వేసింది. దీనిపై సర్కారు ఇప్పట్లో నిర్ణయం తీసుకునే అవకాశం కనిపించడం లేదు.

***(వార్త, దినపత్రిక అక్టోబరు 25, 2009)***



# 'ఫ్రీ'... ప్రహసనం

- అల్లం నారాయణ

చరిత్ర పునరావృతమవుతూనే ఉంటుంది. మరోసారి ప్రహసనంగా, ఈసారి ఫ్రీజోన్‌గా. తెలంగాణ సమస్య తెగనంతవరకూ దాని చరిత్ర నిండా కొన్ని ప్రహసనాలు. కొన్ని గాయాలు, ఎన్నో అవమానాలు, ఎన్నో తకరార్లు. ఎన్నో చిక్కుముళ్లు. ఇదొక శాశ్వత అపరిష్కృత సలిపే గాయం. ఇప్పుడు ఎవరికి చెప్పాలి. చరిత్ర ఎట్లా ప్రారంభమవుతుందో? ఎట్లా చెప్పాలి. నిజాం కాలపు అనంతరం పాలనలోఏమి జరిగిందో? ఎవరికి గుర్తుచెయ్యాలి. అనంతరకాలంలో ఇంగ్లీషు చదువులు రావని, తెలంగాణ వాళ్లను నిరాకరించి ఎన్ని ఉద్యోగాల్లో ఎందరు నిండారో? అది చివరికెట్లా 'గైర్‌ముల్కీ' ఉద్యమం అయిందో? ఇడ్లీ సాంబార్ గ్యోబాక్, గోంగూర గోబ్యాక్ నినాదమయిందో? అంతా ఆంధ్రప్రదేశ్ ఏర్పడక ముందరి చరిత్ర. అప్పుడూ పోయినయి తృణప్రాయంగా ప్రాణాలు. నిజమే. ఇది ప్రాణాలను పణంగా పెట్టే గడ్డ. ఉద్వేగం ముప్పిరిగొన్నప్పుడు ప్రాణాలూ లెక్కచేయని ఒక తత్వమేదో ఈ గడ్డ పొరల్లో దాగి ఉన్నది. అదొక లావా లాంటిది. తెలంగాణ కొలువులను ఎవరో తన్నుకుపోతున్నారన్నప్పుడు.. ఏమివ్వగలరు? మిన్నంటిన కోపం తప్ప... లాఠీలు తిన్నాక.. బుల్లెట్లు మింగే తరం ఒకటి తెలంగాణలో అనాదిగానే ఉన్నది. తుర్రేబాజ్‌ఖాన్‌దాకా ఎందుకు? తెలంగాణ సాయుధ పోరాటంలో పాటల కోసం తూటాలు మింగిన చరిత్ర తెలంగాణదే. సరే జరిగింది. తెలుగు ప్రజల భాష కోసం ఆంధ్రపదేశ్ ఏర్పడిందే అనుకున్నా...పెద్దమనుషుల ఒప్పందాన్ని తన్నుకోపోయిన గద్దలెవరు? ఆ తర్వాత ఏమి జరిగింది. 1969 ఒక చరిత్ర. ఒక మైలురాయి. ఒక టర్నింగ్ పాయింట్ తెలుసా! మళ్లీ ఉద్వేగాలను, ఊపిరులను రెచ్చగొట్టింది ఏమిటో? అదీ కొలువే. అదీ చరిత్రే.నలబై ఏండ్ల కిందటి కొన్నెత్తుటి చరిత్ర. రక్తం సలసల మరిగే ఇటీవలి చరిత్ర. ప్రపంచంలోనే మున్నూటా డెబ్బైమందికి పైబడిన విద్యార్థి వీరులు ప్రాణాలు పణంగా పెట్టిన చరిత్ర. మరి కనపడని త్యాగాల చరిత్ర. అదెట్లా వచ్చిందో? తెలుసా? ఖమ్మం జిల్లా పాల్వంచలో ఉద్యోగాల తకరారు నుంచి వచ్చింది. మళ్లీ కొలువే. గుర్తుంచుకోండి. అప్పుడేముంది భగ్గున మండింది తెలంగాణ. అందలాలెక్కే

వారు కాదు వాళ్లు. రాజకీయాలాడిన వాళ్ళు కాదు. వాళ్లు కొత్త చిగుల్లాంటి, చిగురుటాకుల లాంటి సున్నిత మనస్కులు, రక్తసిక్తమైన అంగీలను జెండాలుగా ఎగరేసిన వాళ్లు. ఆ చరిత్ర విద్రోహంతో ముగిసింది. తెలంగాణ సరే. రాలేదు. కానీ, ఆరు సూత్రాలు... ప్రధాని ఉమ్మడి ఆమోద ప్రకటనలు. పెద్దమనుషులు మాట్లాడుకున్న మాటలు. గాయం మానలేదు. అంతెందుకు? సుప్రీంకోర్టు తీర్పు. ముప్పదిఏడు సంవత్సరాల కింద. 1972 ముల్కీ రూల్స్ చెల్లుతాయన్నందుకు? ఏమి జరిగింది. ఆంధ్రలో... అదీ ఉద్యోగాల గొడవే. అది జై ఆంధ్ర అని ఆంధ్రులను కదిలించింది. అక్కడా ప్రాణాలు బలయ్యాయి. ఆంధ్ర రాలేదు. తెలంగాణ రాలేదు. కానీ, తెలంగాణ పరిస్థితి మరీ హీనమయింది. సచివాలయం నిండింది. హైదరాబాద్ నిండింది. అయితే ఇతరులతో. జోన్లు సరే. రాజధాని సరే దామాషాలో ఏ ప్రాంతానికి ఎన్ని ఉద్యోగాలు రావాలో వచ్చినయా? రాలేదు. తెలుగు ప్రజలారా! లెక్కలు తేలుస్తాయి. అంతెందుకు ఆరు సూత్రాలు.. ముల్కీలు.. రాష్ట్రపతి ఉత్తర్వులు, రాజ్యాంగ సవరణలు.. ఏమిచ్చాయి. తెలంగాణకు రిక్తహస్తాలు, శూన్య వాగ్దానాలు. ఎప్పుడొచ్చింది 610 జీవో ఎందుకొచ్చింది ఆ జీ.వో. అక్షరాలా పాతికా సంవత్సరాల తర్వాత. అప్పటి పరాయి ప్రాంతాల ఉద్యోగుల సంఖ్య ఎంత? ఇప్పుడెంత? ఇంతకీ.. అనంతర కాలంలో ఏమి జరిగింది? ఎవరికి అనుకూలంగా ఏ ఉద్యోగులు, ఏ జీవోలు, ఏ ఉత్తర్వులు, ఏ సూత్రాలు ఎందుకిట్లా జరుగుతున్నది. ఇప్పుడిక ఒక ఫ్రీ జోన్, ఎంతకని పరీక్షిస్తారు. నిజమే కావొచ్చు. అదొక మినహాయింపు నిచ్చిన విభాగంలో పోలీసు ఉద్యోగాల గురించే కావొచ్చు. 610 జీవో అంత పెద్ద సమస్య కాపోవచ్చు. అది ఉన్ని విభాగాలకూ వర్తించకపోవచ్చు. కానీ ఏలికలారా! తెలుగు ప్రజలారా! అది తెలంగాణను మరొక్కసారి గాయపరచలేదా? 610 జీవో అమలు కాదు. గిర్‌గ్లానీ నివేదిక శీతలమై గడ్డకట్టి.. పనికిరానిదయింది. అసలే కడుపు మంటలో ఎగదోసిన ఈ 'ఫ్రీ జోన్' గురించి మండే తెలంగాణ గుండె నుంచి ఆలోచించండి. అప్పుడర్థమవుతుంది ఈ మంటకు అర్థం.నిజమే. అతి చిన్న సమస్యే అనిపించవచ్చు కానీ. ఒక వంక తెలంగాణ అంగలారుస్తుంటే... తెలంగాణ మరోసారి మరోసారి పడిన తరంగంలా, విరిగి పడిన అలలా లేచి నిలబడ్తుంటే ఇంత నిష్పూచీగా 'ఫ్రీ జోన్'లు ఎట్లా వస్తాయి? అదీ ప్రశ్న. ఉమ్మడి ఉద్యోగాల అస్తిత్వం... అది సంస్కృతీ వివక్షే కావొచ్చు భాష కావొచ్చు. యాస కావొచ్చు. అది ఒక్కొక్కప్పుడు నీళ్లు నిప్పులుగా మండడం కావాచ్చు. బొగ్గు రాకాసి మంట కావొచ్చు. కానీ... కొలువులు ఒక తక్షణ భాస్వరం. కొలువులు ఎన్నో రాకపోవచ్చు. మారిన కాలంలో సర్కారు కొలువులే లేకపోవచ్చు. కానీ చరిత్ర నిండా కొలువులే కొలువులై.. కొన్నెత్తుటి చరిత్రలు సృష్టించిన సంగతి మరవద్దు.నిజమే రాజకీయ నాయకులకు రాజకీయ ప్రయోజనాలు ఉండొచ్చు. ఎక్కడో మూలకు పడినవారికి అందివచ్చిన అవకాశమే కావొచ్చు. కానీ...



కొలువుల కోలాటం భగ్గున మండుతుంది. జాగ్రత్త...నిజమే... ఫ్రీ జోన్ మీద ఒక వంక భాగో... భాగో జాగో.. జాగో...లు నడుస్తుండగా... రామకృష్ణాపూర్‌లో బంద్ దిగ్బంధం జరుగుతుండవచ్చు. కానీ ఫ్రీజోన్... ఫ్రీఫర్ ఆల్ అయ్యే ఒక ప్రేరకం అవుతుంది. పారాహుషార్. తెలుగు ప్రజలారా! గాయపడిన గుండె గలవారి తరపున ఆలోచించండి. కొలువులు కోల్పోయిన, కోల్పోతున్న వారి తరఫున ఆలోచించడండి. నిజమే మనం కొట్టుకోవాల్సిన పని ఎంత మాత్రం లేదు. కానీ మూలకు నెట్టిన పిల్లి సంగతి కూడా జర... ఆలోచించండి. 'ఏదో.. ఎవరినో నమ్ముతుంది... ఉద్యోగులు ఆయనను ఇన్ని జరిగిన తర్వాతా నమ్ముతారు' అది వేరే విషయం. ఇప్పుడు ప్రస్తావన అనవసరం. తప్పులు ఒప్పులవడం గురించీ ఇప్పుడు మరీ అనవసరం. 'ఫ్రీ జోన్ భాస్వరాలు పదే పదే ఎందుకు ఎదురువుతాయో.. చరిత్ర నిండా కొలువులు రేపిన మంటలేమిటో? తెలుసుకుంటేనే అందరికీ మంచిదండి.

***(అక్టోబరు 24, 2009, ఆంధ్రజ్యోతి దినపత్రిక)***

# హైదరాబాద్ ఫ్రీజోన్ కాదు, ఆరవ జోన్‌లో అంతర్భాగమే!

- కె. గోవర్ధన్

హైదరాబాద్‌ను ఫ్రీజోన్ అంటూ సుప్రీంకోర్టు చేసిన వ్యాఖ్యానం తెలంగాణా ఉద్యోగుల్లో, మేధావుల్లో, ఉద్యమకారుల్లో తీవ్రమైన ఆందోళనను కలిగిస్తున్నది. ఇప్పటికే దశాబ్దాల తరబడి వివిధ రంగాలలో వివక్షతనూ, అసమానతలనూ, వెనుకబాటునూ ఎదుర్కొంటున్న తెలంగాణ ప్రాంతం పాలిట సుప్రీం కోర్టు ఈ తాజా తీర్పు గొడ్డలి పెట్టుగా మారింది. తెలంగాణ ఉద్యోగ సంఘాలు, ప్రత్యేక తెలంగాణను – ఏ మేరకైనా బలపరిచే రాజకీయ పార్టీలు ఎక్కువ భాగం – ఈ తీర్పు సరికాదని వ్యాఖ్యానించగా, లోక్‌సత్తా పార్టీ ఈ తీర్పును హర్షించింది. కోర్టు తీర్పు దరిమిలా రాష్ట్ర ప్రభుత్వం అఖిలపక్ష సమావేశం నిర్వహించి, ఈ తీర్పుపై సుప్రీం కోర్టులో రివ్యూ పిటిషన్ దాఖలు చేయాలని నిర్ణయించింది. తెలంగాణా ఉద్యోగ సంఘాలు, రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాలు ఎవరి పద్ధతుల్లో వారు ఈ తీర్పు వల్ల తలెత్తే ప్రభావాన్ని రాజ్యాంగ సవరణ ద్వారా సవరించాలని ఆందోళనలకు, పోరాటాలకు దిగుతున్నారు.

**తీర్పు నేపథ్యం**

హైదరాబాద్ సిటీ పోలీస్ రేంజ్‌లో పనిచేస్తున్న ఇన్‌స్పెక్టర్లు కొందరు 610 జీవో నేపథ్యంలో తమను ఇతర జిల్లాలకు బదిలీ చేయడాన్ని సవాలు చేస్తూ ట్రిబ్యునల్, హైకోర్టులలో వ్యాజ్యాలు వేసారు. హైకోర్టు విస్తృత ధర్మాసనం (ఫుల్‌బెంచ్) ఈ వ్యాజ్యాలపై తీర్పును వెలువరించింది. ఈ తీర్పుపై కొందరు ఇన్‌స్పెక్టర్లు 2002లో సుప్రీం కోర్టును ఆశ్రయించారు. వీరి అప్పీళ్ళను జస్టిస్ జి.ఎస్. సింఘ్వీ, జస్టిస్ బి.ఎన్. అగర్వాల్‌లతో కూడిన డివిజన్ బెంచ్ విచారించి తుది తీర్పును 9.10.2009న వెలువరించింది. అంతకు ముందు ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఇచ్చిన (మొత్తం 13 అంశాలు) తీర్పులోని (బి), (సి) మరియు (డి) భాగాలను కొట్టి వేసింది. ఈ తీర్పు ప్రకారం రాష్ట్రంలోని



మిగతా 23 జిల్లాల పోలీసులు కూడా ఇక ముందు హైదరాబాద్ నగరంలో సమాన స్థాయిలో పోటీ పడే అవకాశముంటుంది. స్థానిక రిజర్వేషన్ అనేది హైదరాబాద్ పోలీసులకిక ఉండదు. రాష్ట్రంలోని అన్ని జిల్లాలకు వర్తించే లోకల్ హైదరాబాద్ స్థానికులకు మాత్రం ఇక ముందు వర్తించదు. ఎందుకంటే ఇది ఫ్రీజోన్ అని సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చింది కాబట్టి.

**ఆంధ్ర నాయకుల అసంబద్ధ వాదనలు**

కోస్తాంధ్ర, రాయలసీమలకు చెందిన అధికార కాంగ్రెస్ పార్టీకి, ప్రతిపక్ష తెలుగుదేశం, ప్రజారాజ్యం పార్టీలకు చెందిన కొంత మంది రాజకీయ నాయకులు, ప్రజా ప్రతినిధులు ఒక్క పోలీస్ విభాగంలోనే కాదు, అన్ని విభాగాల్లోనూ హైదరాబాద్‌ను ఫ్రీజోన్ చేయాలని డిమాండ్ చేస్తున్నారు. హైదరాబాద్ రాష్ట్ర రాజధాని గనుక ఇది అన్ని జిల్లాలకు చెందాలని అసంబద్ధంగా వాదిస్తున్నారు. ప్రజా రాజ్యం పార్టీ నేత హరిరామ జోగయ్య, మంత్రి గాదె వెంకటరెడ్డి, ఎమ్మెల్యే టి.జి. వెంకటేశ్‌లతోపాటు టీడీపీకి చెందిన మాజీ మంత్రి కోడెల శివప్రసాద్‌లు ఈలాంటి కుతర్కపు, కుట్రపూరిత వాదనలతో రాష్ట్ర ప్రజానీకాన్ని తప్పు దోవపట్టించే ప్రయత్నాలను సాగిస్తున్నారు. చారిత్రక, భౌతిక వాస్తవాలను మరుగు పరుస్తున్నారు. తెలంగాణ ప్రాంతం పట్ల, ఈ ప్రాంతంలోని ప్రజల మనోభావాల పట్ల అవాకులు చవాకులు పేలుతున్నారు. రెచ్చగొడుతున్నారు.

**హైదరాబాద్ 6వ జోన్‌కు చెందిందే!**

ప్రస్తుతం సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు పోలీస్ శాఖకు మాత్రమే వర్తించేదిగా పైకి కనిపిస్తున్నా ఇది రానున్న కాలంలో అన్ని శాఖలకు విస్తరించే ప్రమాదం వున్నది.

ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం కోసం 1969లో తెలంగాణ ప్రాంతంలో పెద్ద ఎత్తున ఉద్యమం ముందుకొచ్చి, దాదాపు 370 మంది కాల్పుల్లో మరణించిన నేపథ్యంలో ముల్కీ నిబంధనలను ఖచ్చితంగా అమలు చేయడం కోసమని 1969 జనవరి 19న అఖిల పక్ష ఒప్పందంలో ప్రభుత్వం హామీ నిచ్చింది. ఈ ఒప్పందం ఆధారంగానే ఆనాటి బ్రహ్మానంద రెడ్డి ప్రభుత్వం అదే ఏడాది జనవరి 21న జీవో 36ను జారీ చేసింది. ఈ జీవో ప్రకారం తెలంగాణలో అక్రమంగా ఉద్యోగాలు చేస్తున్న స్థానికేతరులను 1969 ఫిబ్రవరి 28 నాటికే వారివారి సొంత ప్రాంతాలకు పంపించివేయాలి. అప్పటికే హైదరాబాద్‌లోనూ, తెలంగాణాలోనూ అక్రమంగా తిష్టవేసిన ఆంధ్రా ప్రాంత ఉద్యోగులు రాష్ట్ర హైకోర్టులో రిట్ పిటిషన్ (నెంబర్ 221/1969) వేయగా జీవో 36 చెల్లదని హైకోర్టు తీర్పు నిచ్చింది.

ఆ తరువాత మరికొంత మంది ఆంధ్ర ప్రాంత ఉద్యోగులు ముల్కీ నిబంధనలనే సవాలు చేస్తూ రాష్ట్ర హైకోర్టు కెళ్ళారు. ఐదుగురితో కూడిన హైకోర్టు న్యాయమూర్తుల ధర్మాసనం 1970 డిసెంబర్ 18న "ముల్కి నిబంధనలు చెల్లవని" తీర్పు నిచ్చింది. ఈ తీర్పును తెలంగాణ వాదులు సుప్రీం కోర్టులో సవాలు చేయగా, 1972 అక్టోబర్‌లో సుప్రీం కోర్టు సంచలనాత్మక తీర్పు నిచ్చింది. "తెలంగాణలో అమలులో వున్న ముల్కీ నిబంధనలు రాజ్యాంగ బద్ధమే"నన్న ఈ తీర్పు పైనే ఆంధ్ర ప్రాంతీయులు "జై ఆంధ్ర" ఉద్యమాన్ని ప్రారంభించారు. తెలంగాణ ప్రాంతానికి ఉమ్మడి రాష్ట్ర ఏర్పాటు సందర్భంగా ఇచ్చిన ముఖ్యమైన హామీలన్నిటినీ రద్దు చేయాలనే లక్ష్యంతో సాగిన ఈ ఆందోళనలో దాదాపు 70 మంది దాకా ప్రాణాలు కొల్పోయారు. ప్రధానంగా ముల్కీ నిబంధనలను రద్దు చేయాలనీ, తెలంగాణ ప్రాంతీయ కమిటీని రద్దు చేయాలనీ, ఎటువంటి షరతులు, హామీలు, రక్షణలు, ఒప్పందాలు లేని ఆంధ్రప్రదేశ్ కావాలని ఈ జై ఆంధ్ర ఉద్యమం డిమాండ్ చేసింది.

నానాటికీ తీవ్రమవుతున్న ఈ ఉద్యమంతో ఆనాటి ముఖ్యమంత్రి పి.వి. నరసింహరావు 1973 జనవరి 18న రాజీనామా చేసాడు. రాష్ట్రపతి పరిపాలనను ప్రవేశపెట్టిన కేంద్ర ప్రభుత్వం 1973 సెప్టెంబర్ 23న రాష్ట్రంలోని ఆంధ్రా, తెలంగాణా రెండు ప్రాంతాలవాసులను సంతృప్తి పరిచే పేరిట ఆరు సూత్రాల పథకాన్ని ముందుకు తెచ్చింది. ఆ తదుపరి దీని కనుగుణ్యంగా "రాష్ట్రపతి ఉత్తర్వులు" వెలువడ్డాయి. ఈ ఉత్తర్వుల ప్రకారం రాష్ట్రాన్ని మొత్తం 6 జోన్లుగా విభజించారు. 1,2,3 జోన్లు కోస్తాంధ్ర ప్రాంతంగానూ, 4వ జోన్‌ను రాయలసీమ ప్రాంతంగానూ, 5,6 జోన్లు తెలంగాణ ప్రాంతంగానూ విభజించారు. హైదరాబాద్, నల్గొండ, మెదక్, నిజామాబాద్, మహబూబ్‌నగర్, రంగారెడ్డి జిల్లాలను 6వ జోన్‌గా పరిగణించారు. రాష్ట్రపతి ఉత్తర్వుల్లో హైదరాబాద్ ఫ్రీజోన్ అని ఎక్కడా పేర్కొనలేదు. 6వ జోన్‌గా మాత్రమే హైదరాబాద్‌ను పేర్కొన్నారు. వాస్తవం ఇది కాగా నేడు సుప్రీం కోర్టు హైదరాబాద్‌ను ఫ్రీజోన్‌గా వ్యాఖ్యానిస్తూ తీర్పు నివ్వడం ఏరకంగానూ సమంజసం కాదు.

**రాష్ట్ర ప్రభుత్వ అనాసక్తి**

హైదరాబాద్ ఫ్రీజోన్ అని సుప్రీం కోర్టు వ్యాఖ్యానించడానికి రాష్ట్ర ప్రభుత్వం సుప్రీం కోర్టులో చేసిన పేలవమైన వాదనలే ప్రధాన కారణంగా ఉన్నాయనేది న్యాయకోవిదుల, విశ్లేషకుల అభిప్రాయంగా వుంది. ఇది వాస్తవం కూడా. 2002 నుండి వ్యాజ్యం నడుస్తున్నప్పుడు దీనిపై రాష్ట్ర ప్రభుత్వం తగు కట్టుదిట్టమైన రీతిలో వ్యవహరించలేదు. ఉత్తరప్రదేశ్‌కి చెందిన సక్సేనా అనే న్యాయవాదిని అడ్వకేట్ ఆన్ రికార్డ్‌గా 2004లో రాష్ట్ర ప్రభుత్వం నియమించింది. ఈయనకు మన రాష్ట్ర చట్టాల



గురించి సరైన, లోతైన అవగాహన లేదు. పైగా ఆయన నియమించిన సీనియర్ న్యాయవాది అనూప్ .జి. చౌదరి మధ్యప్రదేశ్‌కు చెందిన వాడు. ఎంతో కీలకమైన ఈ కేసులో రాష్ట్ర ఏర్పాటు గురించి, రాష్ట్ర చట్టాల గురించి, హైదరాబాద్ ప్రాంత చరిత్ర గురించి లోతైన అవగాహనను గల వారిని నియమించి వుంటే తీర్పు ఈ రకంగా ఉండేది కాదని కూడా బలమైన వాదనలున్నాయి. అంతేకాదు, సుప్రీం కోర్టులో రాష్ట్ర ప్రభుత్వం తరపున వాదిస్తున్న న్యాయవాదులకు సహకరించడానికి సీనియర్ ఐఏఎస్, ఐపీఎస్ అధికారులను సైతం పంపించలేదంటే ఈ అంశంపై రాష్ట్ర ప్రభుత్వానికి గల ఆసక్తి ఏ పాటిదో అర్థమవుతోంది. రాష్ట్ర ప్రభుత్వం తరపున వాదనలు పటిష్టంగా వినిపించనందునే ఈ కేసు వీగి పోయిందనేది వాస్తవంగా కనపడుతోంది.

**పార్లమెంట్‌లో చట్టం తేవాలి!**

చేతులు కాలాక ఆకులు పట్టుకున్న చందంగా నేడు రాష్ట్ర ప్రభుత్వం ముఖ్యమంత్రి రోశయ్య నాయకత్వాన హడావుడిగా అఖిల పక్ష సమావేశాన్ని నిర్వహించి సుప్రీం కోర్టు తీర్పుపై అక్కడే రివ్యూ పిటిషన్ దాఖలు చేయాలని నిర్ణయించింది. ఈ పిటిషన్‌లో జరిగిన తప్పును సవరించుకొనే అవకాశాలు నూటికి 95 శాతంగా కూడా లేవని న్యాయకోవిదులు విశ్లేషిస్తున్నారు. అందుకని రాష్ట్ర ప్రభుత్వం సుప్రీం కోర్టు తీర్పుని పార్లమెంట్ చట్టం ద్వారానే రద్దు చేయించే ప్రక్రియ మాత్రమే ఏకైక ప్రత్యామ్నాయంగా కనిపిస్తున్నది. అలాంటి రాజ్యాంగ సవరణ ద్వారా మాత్రమే జరిగిన ఈ తప్పును సవరించడానికి అవకాశం వుంది. పార్లమెంట్‌లో దీనికి తగినంత మెజారిటీ వుంది. రాష్ట్రంలోనూ, కేంద్రంలోనూ కాంగ్రెస్ ప్రభుత్వమే వున్నందున, ప్రధాన ప్రతిపక్షమైన బీజేపీ కూటమి, 'వామపక్షాల' తృతీయ కూటమిలు కూడా ఈ తీర్పు సరికాదంటున్న నేపథ్యంలో పార్లమెంట్‌లో సవరణ పెడితే ఎట్టి పరిస్థితిలోనూ నెగ్గి తీరుతుంది. ఇప్పుడు కావాల్సిందల్లా కాంగ్రెస్ పార్టీకి చిత్తశుద్ధి, దృఢ సంకల్పం మాత్రమే. సుప్రీం కోర్టులో రివ్యూ పిటిషన్ వేసి చేతులు దులుపుకోవాలనే వైఖరి నుండి అధికార కాంగ్రెస్ ఇకనైనా వెనుదిరగాల్సి వున్నది. లేకుంటే తెలంగాణ ప్రాంతానికి తీరని అన్యాయం జరుగుతుంది. ఈ ప్రాంత ప్రజల మనోభావాలు మరింత దారుణంగా దెబ్బతింటాయి.

**ముల్కీ పోరాటం నైజాం కాలం నాటిది**

ముల్కీ (స్థానికంగా నివాసముండడం) నిబంధన అనేది తెలంగాణలో నైజాం నవాబుల పాలన కంటే ముందు నుండే కొనసాగుతున్నది. నిజాం రాజులు తమ పరిపాలనను సాగించడానికి గానూ అధికారుల్లో ఎక్కువ మందిని స్థానికులు గాకుండా

బయటి వారిని తీసుకొచ్చే వారు. స్థానిక తెలంగాణ ప్రజలకు సరైన విద్యలేదని, దానిలోనూ తగినంత ప్రావీణ్యత లేదనే పేరిట ఉత్తరాది వాళ్ళపై ఎక్కువగా ఆధారపడేవారు. కాయస్థ బ్రహ్మణులను తీసుకొచ్చి వారితో పరిపాలనను సాగించేవారు. దీనిని స్థానికంగా ఉండే ఉద్యోగులు, ప్రజలు ఆనాడే వ్యతిరేకించారు. స్థానికులకే ఉద్యోగాలుండాలనే ముల్కీ డిమాండ్ 1919వ సం॥రాల్లోలోనే మొగ్గ తొడిగింది. తెలంగాణ ప్రాంతాన్ని భానిసత్వపు చీకటి కొట్టంలో వుంచి ఇక్కడి భాషను ఏ మాత్రం ఎదగనీయకుండా, గౌరవించకుండా, కేవలం ఐదు శాతం కూడా మాట్లాడని ఉర్దూను రాజ భాషగా చేసి ప్రజలపై బలవంతంగా రుద్దారు. ఫలితంగా తెలంగాణ విద్యా రంగం ఆనాటి నుండే ధారుణమైన వివక్షతకు, నిర్లక్ష్యానికి గురవుతూ వచ్చింది. ఈ నేపథ్యంలో 1956 రాష్ట్ర అవతరణ సందర్భంగానూ చేసుకున్న "పెద్ద మనుషుల ఒప్పందం"లో ముల్కీని తెలంగాణలో అమలు జరుపుతామనే ముఖ్యమైన హామీని కూడా ఇందులో పొందు పరచాల్సి వచ్చింది. ఆచరణలో ఎవరు ఏమి చెప్పినా ముల్కీ నిబంధన అమలును నీరుగార్చడమేగాకుండా కాలక్రమంలో దాన్ని సంపూర్తిగా రద్దు చేసారు. ఫలితంగా తెలంగాణకు గుండెకాయల్లాంటి హైదరాబాద్ నగరంలోని దాదాపు అన్ని ప్రభుత్వ శాఖల్లోనూ స్థానికేతరులదే పై చేయి అయ్యింది. చివరికీ నాడు హైదరాబాద్ ఫ్రీజోన్ అనే వరకు వెళ్ళడానికి రాష్ట్రాన్ని ఇన్నాళ్లుగా ఏలిన వారిదే ప్రధాన బాధ్యత. కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు రెంటికి రెండూ తెలంగాణ ప్రాంతాన్ని అన్ని రంగాల్లోనూ ధారుణమైన వివక్షకూ, అన్యాయానికీ, వెనుకబాటుకూ, నిర్లక్ష్యానికీ గురి చేశాయి. తెలంగాణ ప్రాంత ప్రజలు తమ ప్రాంతంలోనే పరాయివారమైనామనే భావాన్ని కలుగజేశాయి.

### సుప్రీం తీర్పు తెలంగాణ అస్థిత్వానికే సవాల్

నేటి సుప్రీం కోర్టు తీర్పును పైపైన చూసి ఇది ఉద్యోగులకు, లేదా అందులో ఒక్క పోలీసు విభాగానికి సంబంధించిన అంశంగానే చూడరాదు. ఇది మొత్తం తెలంగాణ ప్రాంత అస్థిత్వానికి సంబంధించినదిగా చూడాల్సుంటుంది. వరుసగా రాయలసీమ, కోస్తాంధ్రలకు చెందిన పాలకుల హయాంలలో తెలంగాణ ప్రాంతం అన్ని రంగాలలోనూ దారుణమైన వివక్షతనూ, వెనుకబాటు తనాన్నీ, అసమానతలనూ ఎదుర్కొన్నది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ఏర్పాటు చేసే సందర్భంగా పెద్ద మనుషుల ఒప్పందంలో ఇచ్చిన హామీలు ఏ ఒక్కటీ అమలుకు నోచుకోలేదు. నాటి సంజీవ రెడ్డి మొదలుకొని మొన్నటి చంద్రబాబు, నిన్నటి రాజశేఖర్‌రెడ్డి, నేటి రోశయ్యల దాకా తెలంగాణ పట్ల వివక్షను, అసమానత్వాన్ని కొనసాగిస్తున్నారనడానికి 610 జీవో, గిర్‌గ్లానీ కమిటీ సిఫారసులు అమలు కాక పోవడమే తిరుగులేని సాక్ష్యం. గత 50 సం॥రాలుగా ఇచ్చిన పథకాలు, హామీలు, ఒప్పందాలు, సూత్రాలు, ఉత్తర్వులేవీ తెలంగాణ ప్రాంత ప్రజల హక్కులను, మనోభావాన్ని గౌరవించ లేదు. పైగా అడుగడుగునా అన్యాయాలు, అక్రమాలు అనునిత్యం కొనసాగుతూనే వున్నాయి. ఈ నేపథ్యంలోనే సుప్రీం కోర్టు తాజా తీర్పుని కూడా చూడాలి.

నేడు సుప్రీం తాజా తీర్పు హైదరాబాద్ పోలీస్ విభాగంలో మాత్రమే అమలు కాదు. అది అన్ని రంగాలకూ క్రమక్రమంగా విస్తరింపజేయాలనే కుటిల పన్నాగాలు, కుయుక్తులు ఈనాడే కాదు, ఏనాటి నుండో కొనసాగుతున్నాయనే వాస్తవాన్ని గ్రహించాలి. తెలంగాణ ప్రాంతం నుండి హైదరాబాద్ నగరాన్ని వేరు పర్చాలనే పాలకుల 'మహా' కుట్రను చైతన్యవంతంగా అర్థం చేసుకోవాలి. తెలంగాణ అస్థిత్వాన్ని, తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాడాలనే ప్రజాస్వామిక డిమాండ్‌ను అడ్డుకొంటున్న స్వార్థపర దోపిడీ శక్తుల పట్ల నిరంతరం అప్రమత్తంగా వుండాలి. ఫ్రీజోన్ రద్దుకై, 610 జీవో అమలుకై, సింగరేణిలో ఓపెన్ కాస్టుల పేరుతో జరుగుతున్న విధ్వంసాన్ని అరికట్టడానికీ, సెజ్‌ల పేరిట కొనసాగుతున్న భూ నిర్వాసిత్వానికి వ్యతిరేకంగా ప్రజానీకాన్ని చైతన్య పర్చాలి. విద్య, ఉపాధి, ఉద్యోగ అవకాశాల్లో, బడ్జెట్ కేటాయింపుల్లో, జలవనరుల్లో జరుగుతున్న అన్యాయ పంపిణీకి వ్యతిరేకంగా పోరాడాలి. మొత్తంగా తెలంగాణ ప్రాంతంలో జరుగుతున్న అన్ని రకాల వివక్షలకు, అసమానత్వాలకు వ్యతిరేకంగా పోరాడాలి. విస్తృత స్థాయిలో ప్రజా పోరాటాలకు ప్రజలను సంసిద్ధం చేయాలి. న్యాయ సమ్మతమైన ఈ ప్రజాస్వామిక పోరాటాలకు అన్ని ప్రాంతాల, వర్గాల ప్రజల మద్దతును, సంఘీభావాన్ని కూడ గట్టాలి.

***(ప్రజాపంథా 28.10.2009లో ప్రచురితం)***

# తప్పెవరిది?

సుప్రీంకోర్టు తాజా తీర్పు నేపథ్యంలో మళ్ళీ హైదరాబాద్ ఫ్రీ జోన్ వివాదం తెరపైకి వచ్చింది. ఇది పోలీసు శాఖలోని కొన్ని ఉద్యోగాలకు సంబంధించిన వివాదమే అయితే ఇంత ఉద్వేగాత్మక సమస్యగా మారకపోయేది. విస్తృతంగా ఆలోచిస్తే రాష్ట్ర సమగ్రత, ప్రాంతాల సమన్యాయానికి సంబంధించినది. సుప్రీంకోర్టులో నడిచిన వివాదంలో కక్షిదారులు ఎవరైనా ఉండవచ్చు. చరిత్రను పరిశీలిస్తే మాత్రం – బాధ్యతా రహితంగా సమస్యను ముదరబెట్టిన లేదా కొత్త సమస్యలు రాజేసిన రాష్ట్ర ప్రభుత్వమే దోషిగా నిలబడక తప్పదు. ఈ సమస్యను అవసరార్థం వాడుకుని పబ్బం గడుపుకున్న రాజకీయపక్షాలు తమ దోషాన్ని కప్పిపుచ్చుకోలేవు.

హైదరాబాద్ పోలీసు కమిషనరేట్‌ను ఫ్రీ జోన్‌గా స్పష్టం చేస్తూ సుప్రీంకోర్టు శుక్రవారం తీర్పు ఇవ్వడంతో ఈ సమస్య ఉత్పన్నమైంది. దీని వలన హైదరాబాద్‌లోని పోలీసు కానిస్టేబుల్స్, ఎస్ఐల నియామకంలో జిల్లా స్థానిక అభ్యర్థులను పరిగణనలోకి తీసుకోకుండా అన్ని ప్రాంతాల వారికి అవకాశం కల్పించాల్సి ఉంటుంది. హైదరాబాద్‌లో పనిచేస్తున్న పోలీసు శాఖలలోని కొందరు ఇన్‌స్పెక్టర్లు తమ బదిలీని సవాలు చేస్తూ అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్‌ను ఆశ్రయించడంతో ఈ వివాదం మొదలైంది. హైదరాబాద్ ఆరవ జోన్ కిందకు వస్తుందన్న వాదనను ట్రిబ్యునల్‌తోసిపుచ్చింది. ఆ తరువాత వివాదం హైకోర్టుకు చేరింది. హైదరాబాద్ ప్రత్యేక జోన్ అంటూ ఏదీ లేదని హైకోర్టు స్పష్టం చేసింది. ఆ తరువాత కేసు సుప్రీంకోర్టుకు చేరింది. సుప్రీంకోర్టు తీర్పు హైకోర్టు తీర్పుకు ఎందు విరుద్ధంగా ఉందనే సందేహం రావడం సహజం. కానిస్టేబుల్ వంటి ఉద్యోగాలలో ప్రతి జిల్లాలో స్థానికులనే నియమిస్తారు. సబార్డినేట్ రూల్స్ ప్రకారం అయితే హైదరాబాద్‌లోని నియామకాలు కూడా ఇదే విధంగా జరగాలి. కానీ నిజాం కాలం నాటి హైదరాబాద్ పోలీసు చట్టం ప్రకారం నియామకాలు జరిగాయి. ఈ చట్టం ప్రకారం జరిపితే జోనల్ విధానం వర్తించదు. సమస్యకు మూలం ప్రభుత్వం అనుసరించిన విధానమే. హైకోర్టు సాంకేతికాంశాలను పరిశీలించడంతోపాటు అన్ని పక్షాల వాదనలను విన్న తరువాత హైదరాబాద్ ఫ్రీ జోన్ కాదని తీర్పు ఇచ్చింది.



హైకోర్టులో ఇంప్లీడ్ అయిన తెలంగాణ సంఘాల వారు కేసు సుప్రీం కోర్టుకు చేరినప్పుడు మాత్రం పట్టించుకోలేదు. రాష్ట్ర ప్రభుత్వం తమ వాదనను బలంగా వినిపించలేదనే విమర్శ ఉంది.

ఆందోళనలను తలెత్తినప్పుడు వివిధ ఒప్పందాలకు అంగీకరించిన ప్రభుత్వం ఆ తరువాత వాటిని తుంగలో తొక్కడం వల్లనే నేటి పరిస్థితి ఏర్పడింది. సమస్య ఒక శాఖలో కొన్ని ఉద్యోగాలకు సంబంధించినదే అయితే ఏదో విధంగా పరిష్కరించవచ్చు. కానీ తమకు అన్యాయం జరిగిందనే భావన ఒక ప్రాంతం వారిలో వ్యాపించడం సాధారణ విషయం కాదు. దాని ఫలితాలు ఏ విధంగా ఉంటాయో గతంలో అనుభవానికి వచ్చిన తరువాత కూడా ప్రభుత్వం కానీ, ఉన్నతాధికారులు కానీ, రాజకీయ నాయకులు కానీ బాధ్యతతో వ్యవహరించలేదు. జోనల్ విధానాన్ని కట్టుదిట్టంగా అమలు చేసినట్లయితే 1985లో 610 జీఓ అవసరం రాకపోయేది. 610 జీవోను, ఇతర హామీలను దశాబ్దాల కాలం నానబెట్టకుండా అమలుచేసినట్టయితే 2001లో గిర్‌గ్లానీ కమిషన్‌ను నియమించాల్సిన అవసరం రాకపోయేది. గిర్‌గ్లానీ కమిషన్‌కు వివిధ శాఖల అధికారులు సహకరించలేదనే ఆరోపణను ప్రభుత్వం పట్టించుకోనే లేదు. 2004లో గిర్‌గ్లానీ కమిషన్ నివేదిక సమర్పించిన తరువాత, ఈ సూచనలను పరిశీలించి అమలు చేయడానికి తీసుకున్న చర్యలు హాస్యాస్పదంగా మారాయి. 2004లో ఏర్పడిన కాంగ్రెస్ ప్రభుత్వం శాసన సభా కమిటీని ఏర్పాటు చేసింది. మంత్రులు కమిటీని నియమించింది. చీఫ్ సెక్రటరీ నేతృత్వంలో ఉద్యోగ సంఘాల నాయకులు సభ్యులుగా మరో కమిటీని ఏర్పాటు చేసింది. అయినా సాధించింది శూన్యం. సచివాలయంలో, ఇతర రాష్ట్ర స్థాయి కార్యాలయాలలో జోనల్ విధానం వర్తించదని రాష్ట్రపతి ఉత్తర్వు స్పష్టం చేసింది. నిజమే. అయితే ప్రాంతాల మధ్య సమన్యాయం పాటించాలంటూ చేసిన సూచనను ప్రభుత్వం చిత్తశుద్ధితో అమలుచేసినట్టయితే ఈ రోజు ఇంత వివాదమే రగిలేది కాదు. తమకు అన్యాయం జరుగుతున్నదనే భావన ఏ ప్రాంతంలో వ్యాపించినా అందుకు ప్రభుత్వం ఇంతకాలం అనుసరించిన వైఖరే కారణమని చెప్పవచ్చు.

సుప్రీంకోర్టు తాజా తీర్పుపై రివ్యూ పిటిషన్ వేయాలని కొన్ని ఉద్యోగ సంఘాలు భావిస్తున్నాయి. పిఆర్‌పి నేత హరిరామ జోగయ్య అన్ని శాఖలకు ఇదే ఫ్రీజోన్ సూత్రం వర్తింప చేయాలని డిమాండ్ చేశారు. టిఆర్ఎస్ ద్విముఖ పోరు సాగించనున్నట్టు ప్రకటించింది. అయితే ఇంత ఉద్వేగ భరిత ప్రకటనలోనూ టిఆర్ఎస్ ఒక సూచన చేసింది. 'ముల్కీ నిబంధనలను అమలు చేయాలి. 1972లో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును నిబంధనలను అమలు చేయాలని 1972లో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును ఆంధ్ర ప్రాంతీయుల ఆందోళన నేపథ్యంలో రాష్ట్ర ప్రభుత్వం పక్కన పెట్టింది. ఇప్పుడూ అదేవిధంగా వ్యవహరించాలి' అని టిఆర్ఎస్ సూచించింది. తమ ప్రాంతానికి వ్యతిరేకంగా ఉన్న ఒప్పందాలను, తీర్పులను మాత్రమే అమలు జరుపుతూ,

అనుకూలంగా ఉన్న వాటిని తుంగలో తొక్కుతున్నారనే ఆందోళన ఇప్పటికే తెలంగాణ వారిలో నెలకొన్న మాట వాస్తవం.

సుప్రీంకోర్టు తీర్పు నేపథ్యంలో ఏర్పడిన సమస్యను పరిష్కరించడం అంత సులభం కాదు. వందలాది మందిని మళ్లీ నగరానికి బదిలీ చేయకపోతే న్యాయస్థానాన్ని ఆశ్రయిస్తారు. వారిని ఇక్కడ సర్దడం వల్ల కొత్త చిక్కులు రావచ్చు. ఈ చిక్కుముళ్ళన్నీ మరింత సంక్లిష్టం కాకుండా చేయాలంటే ప్రభుత్వమూ, రాజకీయ పక్షాలు బాధ్యతాయుతంగా వ్యవహరించాలి. అన్నిటికీ మించి ప్రభుత్వం అనుసరించే విధానమే ప్రధానమైనది. ఒప్పందాలు, నిబంధనలు, కోర్టు తీర్పులు ఎలా ఉన్నా అన్ని ప్రాంతాల మధ్య సమన్యాయం సాధించడం ప్రభుత్వం కర్తవ్యం. నియామకాలు, బదిలీలు, డిప్యూటేషన్లు, ప్రమోషన్లలో ప్రభుత్వం సమన్యాయం సాధించిన నాడు ఎవరు ఆందోళన చేసినా ప్రజలు హర్షించరు. ప్రభుత్వం ఇప్పటికైనా తన నిజాయితీని చాటుకోవాలి.

***(ఆంధ్రజ్యోతి దినపత్రిక సంపాదకీయం, 14 అక్టోబరు 2009)***





*Important Paragraphs of Judgement of Hon'ble High Court of A.P. on Hydrabad Free Zone Issue:*

**IN THE HIGH COURT OF JUDICATURE OF A.P. AT HYD.**

**S.B. SINHA, CJ.,**

**S.R.NAYAK AND**

**GODA RACHURAM, JJ.**

Twenty Second Day of November, 2001

WP No.13458 of 2001 and Batch

G. Anantha Reddy v. Andhra Pradesh Admn. Tribunal, Hyd. and others

**A.P. Public employment (Organisation of Local Cadres and Regulation of Direct Recruitment) Order, 1975 - Para 5 (1) - Transfer of a member of any police force can only be in conformity with Para 5 of the Presidential Order, 1975 - Transfers of members of police force from the local cadre to another local cadre can be effected only in exigencies like non-availability of suitable candidates or in public interest, assigning reasons. Transferred incumbents have to be reverted back to parent cadre after cessation of exigencies - Person transferred is entitled to seniority in the unit to which he is transferred.**

47. Para 14 of the Presidential Order saves posts in specified departments, establishments or institutions from the provisions of the Presidential Order, which includes any post of Police Officer as defined in Cl.(b) of Sec. 3 of the Hyderabad City Police Act 1348 Fasli. The posts in institutions, departments or establishments set out in para 14 of the Presidential Order are thus outside the ambit of the provisions of the Presidential Order. Para 11 enacts and overriding effect to the provisions of the Presidential Order over any statute, Ordinance, rule, regulation or other order made before or after the commencement, of the Presidential Order.

49. On an analysis of the provisions of the Presidential Order and in particular those adumbrated above, it is clear that having regard to the historical compulsions which have led to the enactment of Art. 371D the Presidential Order provides the framework for intra State compartmentalisation of certain posts under the rubric of local cadres, constituted for parts of the State and

protects the service conditions of members allotted or recruited to such local cadres in respect of matters specified in para 5 (1). The local cadres are thus the result of the historical compulsions engendered by economic and other differentia operating between parts of the State of Andhra Pradesh and of the felt grievances of residents of such parts of the State.

50. In construing the power granted to the State Government under para 5 (2) for making provisions for transfers of persons, we must not loose sight of the historical compulsions which have led to the enactment of the Presidential Order, which is buttressed by the over riding effect given to the provisions of the Presidential Order not only against the exercise of the majoritarian, political and executive choices of the State, but is also made operative against any other provisions of the Constitution of India (Art. 371D(10) read with Para 11 of the Presidential Order).

60. In terms of the II Schedule there are only six zones. The city of Hyderabad comes within the purview of Zone-VI. The city of Hyderabad, although loosely treated as a separate zone, but no such separate zone has been created. The city of Hyderabad therefore comes within the purview of Zone- VI only.

81. Nothing has been placed before this court to demonstrate that any appointments of police officers have been made only under the provisions of either the Hyderabad City Police Act 1348-Fasli but they have been made also under the Andhra Pradesh (Andhra Area) District Police Act 1859 or the Andhra Pradesh (Telengana Area) District Police Act, 1349 Fasli. All appointments have been made under the relevant Rules made under proviso to Art. 309 of the Constitution including the Andra Pradesh Police Service Rules; Andhra Pradesh Subordinate Service Rules; Andhra Pradesh police (Armed Reserve) Service Rules; Andhra Pradesh (Communications) Subordinate Service Rules; Andhra Pradesh Police (Computer Centre) Service Rules and the Andhra Pradesh Police (Computer Centre) Subordinate Service Rules, etc.

82. Sec. 2 (b) of Hyderabad City Police Act 1348 Fasli defines a Police Officer to include every member of the City Police Force appointed under this Act as also the Commissioner of City Police, Hyderabad, the Deputy or Assistant Commissioner of Police and subject to provisions of Sub-sec.( 2) Sec. 9 and sub-sec. (2) of Sec. 10 every person who has been appointed as an Additional or Special Police Officer.Sec.7 of this Act vests in the Commissioner of City Police the power to appoint and promote Inspector of Police, Sub Inspector of Police and other subordinates of the force and empowers the Government to appoint the Deputy Commissioner and Assistant Commissioner of Police. Sections 9 and 10 provide the power to appoint Additional Police Officer and Special Police respectively. No Police Officer has been appointed under the provisions of this Act. All recruitments are notified and appointments made under the Special Rules made under the proviso to Art 309 of the Constitution. Thus, though the post of a Police Officer as defined in Sec. 3 (b) of the Hyderabad City Police Act 1348 Fasli is beyond the purview of the Presidential Order, in view of para 14 of the said Order, there is in fact no Police Officer as defined in Sec. 3 (b) of the Hyderabad City Police Act 1348 Fasli, factually in existences.



83. As there has been no institution of a separate cadre for the city of Hyderabad for members of the Police Force in terms of para 3 (6) of the Presidential Order, members of the Police force allotted or recruited to Hyderabad must be construed as having been so allotted or recruited to either the District cadre of Hyderabad or zonal cadre of Zone VI viz Hyderabad , Nizamabad, Mahabubnagar, Medak and Nalgonda Districts, as the case may be, depending upon the rank they hold, whether it is a District cadre post of a zonal cadre post.

84. The post of an Inspector of Police in the Police department having been specified as item 51 of the 3rd Schedule and being a specified gazetted category in terms of Para 2 (1) (j) read with 3 (4) of the Presidential Order and being required therefore, to be organised into a zonal cadre of Inspector of Police including those working for the once as part of the Hyderabad city police, have to be considered as members of Zone VI which includes the District of Hyderabad. They do not fall within the provisions of para 14 of the Presidential Order. The transfers from and the establishments and units of Hyderabad City Police therefor fall within the parameters of para 5 (2) (c) to (d). A person once allotted to one zone and attached to his post must be said to be belonging to the same zone and he has no right to come to any other cadre, which is not organised one.

85. To the aforementioned extent, the Full Bench decision of the Tribunal in O.A.Nos. 22622 to 635 must be held to have not been rendered correctly.

**CONCLUSIONS :**

(a) Transfers and to the departments, institutions, establishments, specified in para 14 of the Presidential Order are outside the limitations of the Presidential Order.

(b) No separate cadre has been organised for the City of Hyderabad within the meaning of para 3 (6) of the Presidential Order.

(c) No recruitment of the post of the police officer as defined in Sec. 3 (b) of Hyderabad City Police Act 1348 Fasli has been made and there is thus factually no incumbent of the post of a police officer under para 14 (f) of the Presidential Order.

(d) Inspectors of Police working in the Hyderabad City Police estab-

lishments either on promotion to that post or by direct recruitment, must be considered as belonging to Zone VI in the zonal cadre.

(e) The provisions of Sec. 3 of the Act 1985 imposing a liability on a members of the police force to serve in any part of the State of Andhra Pradesh and the concomitant power of the Sate Government to effect such transfer has to be in conformity with the provisions of para 5 (2) of the Presidential Order in view of the provisions of Art. 371 D (10) of the Constitution and para 11 of the Presidential Order.

(f) Transfer of a member of the police force form any local cadre to any office or establishment under para 14 or vice versa, the transfer of a person from any local cadre comprising posts in any office or establishment exercising territorial jurisdiction over a part of the State to another local cadre comprising posts of such part of vice versa and the transfer of a person form one local cadre to another local cadre could be effected only where no qualified or suitable person is available in such later cadre or where such transfer is otherwise considered necessary in the public interest and not otherwise. Wherever such transfers are made on the ground of public interest, such public interest must be of such overriding impact as to warrant a departure from the local cadre discipline set out in paras 3,4, 5 (1) and 6 of the Presidential Order.

(g) While effecting such transfer, reasons must be recorded justifying such transfers either on the ground of there being no qualified or suitable person available in the cadre to which transfer is to be effected or on the ground of overriding public interest.

(h) Such transfers are normally to be of limited duration or tenure coterminus with the specified exigency for which the transfer is made and shall cease to be operative and the incumbent transferred liable to be reverted to the parent cadre immediately on the cessation of such exigency, which warranted the transfer.

(i) Transfer on long-term basis or of indeterminate duration should be in the rarest of circumstances, again for clearly specified reasons and there should be a periodical review of the need for continuance of the person so transferred in the transferred local cadre.



(j) In all cases of transfer made in the circumstances set out in para 5 (2) (a) to (c) and on the principle after stated, the person so transferred is entitled to his seniority in the unit to which he is transferred. Rule 3 of the Rules under the Act 1985 is valid.

(k) In the case of transfers on reciprocal basis, the seniority or persons transferred shall be in accordance with the prescriptions of para 5 (2) (d). Rule 3 of the Rules under the Act, 1985 is in such cases inoperative.

(l) Even in case of transfers on reciprocal basis, due regard must be had to the principles of maintenance of the composition of balance local cadre with reference to age and seniority groups, the administrative needs of the posts in the local cadres and the like as set out in para 4 (2) of the Presidential Order.

(m) Rule 3 of the Rules made under the provisions of the Act 1985 is operative to the extent it is in conformity with the principles set out in Paras (j) and (k) above.

--- ooOoo ---

**Important paragraphs of Judgment of Hon'ble Supreme Court of India Delivered on Hyderabad Free Zone Issue**

**In the supreme Court of India Civil Appellate Jurisdiction Civil Appeal No. 5141 of 2002.**

P.V. Radha Krishna and other ... Appellants

Versus

State of A.P. and others ... Respondents

WITH

**Civil Apela No. 5142 of 2002**

M. Bhaskar Reddy and others ... Appellants

Versus

State of A.P. And others ... Respondents

WITH

**CIVIL APPEAL NO. 5144 OF 2002**

G. Jaya Prasad and others ... Appellants

Versus

State of A.P. and others ... Respondents

WITH **CIVIL APPEAL NO. 2965 OF 2003**

B. Venkat Reddy ... Appellants

Versus

State of A.P. and others ... Respondents

- JUDGMENT

G.S. Singhvi, J.

29. From what we have noted above, it is evident that the post of police officers of Hyderabad City as defined in section 3 (b) was not included in the process of localization of cadres undertaken in terms of paragraphs 3 and 6 of the Presidential order. The localization/zonalization of subordinate cadre in the police department was effected for six zones/ ranges but the same was not applicable to Hyderabad City police. If this was not so, there was no reason to exclude posts earmarked for Hyderabad City from the statement of cadre strength of localized cadres enumerated in various Annexure appended to G.O. Ms. No. 795 dated 30.6.1976. The object of exclusion of certain posts from the purview of the presidential order and consequently from the scheme of localization/ zonalization required to be undertaken in terms of paragraphs 3 and 6 there of was to make recruitment against such posts open for all without giving any preference to any local candidates. The reason why special status was given to the posts located in the specified departments of Hyderabad City, which is capital of the state, was that there should be no monopoly of candidates belonging to any particular area of the State in the matter of recruitment etc. against those posts and all eligible candiates must get opportunity to compete for selection and appointment.

30. It is also significant to note that after promulgation of the Presidential Order, Hyderabad City has throughout been treated as an independent zone of free zone till the impugned judgement was pronounced and recruitment to the post of police officer as defined in Section 3 (b) of the Hyderabad Act was made separately. This was the categorical stand taken by the official respondents before the Tribunal while contesting the O.A. of the private respondents. In reply to paragraph 6 of the O.A. filed by Sardar Harihar Sing, it was specifically averred on behalf of the state that vacancies in respect of posts of Hyderabad City Police are notified separately and selections/ appointments to the posts of Sub-Inspectors of Police, Civil and Reserve Sub-Inspector, CAR and Police Constable of both Civil and CAR to the extent of vacancies are conducted separately and all six zones and Hyderabad City Police are separate zones for all service matters i.e., appointments, promotions, etc. and Hyderabad City Police is not part of zone VI. The contra stand taken in the counter affidavits filed before this Court is inexplicable and it liable to be discarded..

31. We shall consider whether conclusions (b), (c) and (d) recorded by the Full Bench of the High Court are legally correct and sustainable. The observation of the Full Bench that no separate cadre has been organized and no Police Officer has been appointed under the Hyderabad Act is based on the Premise that in the advertisement issued for recruitment of Police Officers and appointment orders of the appellants and other similarly situated persons, reference has not been made to Hyderabad Act. While doing so, the Full Bench omitted to take note of the fact that in terms of Section 7 of the Hyderabad Act, powers to appoint and promote Inspector, Sub-Inspector and other subordinates of the police force vests in the Commissioner of City Police Hyderabad and the said Section finds specific mention in the preamble to the Special Rules framed in 1959. Rule 3 of those Rules clearly lays down that as far as Hyderbad City Police is concerned, the Commissioner of Police shall be the appointing authority of Sub-Inspectors of Police etc. and by virtue of that power, the Commissioner of Police, Hyderabad has been making appointments of various subordinate posts including those of Sub-Inspectors. In the advertisement of 1985



 

pursuant to which the appellants were appointed as Sub-Inspectors, 93 posts were separately earmarked for Hyderabad City which, for the sake of convenience, was described as zone VII or free zone. Even in the subsequent advertisements issued in 1991 and 1994, the vacancies of Sub-Inspectors were separately earmarked of Hyderabad City Police Range. The orders of appointment of the appellants were issued by the Commissioner of Police. This shows that a separate cadre has been carved out for Hyderabad City Police and recruitment to the post of Police Officers as defined in Section 3 (b) of the Hyderabad Act has been made by the designated competent authority in terms of Section 7 thereof. Therefore, the Full Bench was not justified in curtailing the width and scope of the exclusion clause contained in paragraph 14 (f) of the Presidential Order by holding that there no separate cadre of Hyderabad City Police and there is no incumbent of the post of Police Officers as defined in Section 3 (b) of the Hyderabad Act.

32. In view of the above discussion, we hold the conclusions recorded by the Full Bench that no separate cadre has been organized for the City of Hyderabad within the meaning of paragraph 3 (6) of the Presidential order; that no recruitment to the post of Police Officer as defined in Section 3 (b) of the Hyderabad Act has been made and there is factually no incumbent of the post of Police Officer under paragraph 14 (f) of the Presidential Order and that the Inspectors of Police working in the Hyderabad City Police establishment either on promotion to the post or by direct recruitment must be considered as belonging to Zone VI in the zonal cadre cannot be sustained and are liable to be set aside.

33. In the result, the appeals are allowed and conclusions (b), (c) and (d) recorded in the impugned judgment are set aside. The parties are left to bear their own costs.

..............................................

(B.N. AGRAWAL)

..............................................

(G.S. SINGHVI)

Court No. 4 SECTION XIIA

New Delhi,
October 9, 2009,
Item No. IA
(For judgment)

SUPREME COURT OF INDIA
RECORD OF PROCEEDINGS